Chithralaya

నాగేశ్రీ సమర్పించు

రవిరాజ్ ప్రొడక్షన్సు వారి

# మరపురాని తల్లి

దర్శకత్వం: డి. ఎస్. ప్రకాశరావు   నిర్మాత: కేశవ జయరామ్



గొల్లపూడి

సంగీతం: కె.వి. మహదేవన్

కళ: బి.బి. రాజేంద్రకుమార్

కెమెరా: లక్ష్మణ్ గోరే

కూర్పు: వీరప్ప.  నృత్యం: కె.ఎస్. రెడ్డి

విజయా కంబైన్సు రిలీజ్

VIJAYA

# 1972

## చందమామ రజతోత్సవ సంవత్సరం

ఈ శుభసమయాన చందమామ మరి రెండు కవలలను చేర్చుకొంటున్నది !

## చాంద్‌మామ (బెంగాలీ)

## జాహ్నమాము (ఒరియా)

ప్రారంభ సంచికలు ఇప్పుడు అన్ని బుక్ స్టాల్సులోను లభించుతున్నవి.

పది దేశీయ భాషలలో వెలువడుతున్న చందమామ కమ్మటి కథలతో, అందమైన రూపంతో ఇకముందు కూడ భారత దేశపు బాలబాలికలకు విజ్ఞానం, వినోదం చేకూర్చగలదు !

ప్రతి ఒకింటికి 90 పైసలు  ఏడాదికి రు. 10-80

వివరాలకు :

## డాల్టన్ ఏజన్సీస్

చందమామ బిల్డింగ్స్

మదరాసు - 26




చిత్రకళా ఫిలింస్

# కిలాడి బుల్లోడు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత:
నందమూరి సాంబశివరావు

దర్శకత్వం:
నందమూరి రమేష్

ఫోటోగ్రఫీ: ఎస్ వెంకటరత్నం W.I.C.A.,
సంగీతం: టి చలపతిరావు

తప్పక
చూడండి!

ఆంధ్ర: అపరాజిత ఫిలింస్
రాయలసీమ: నవభారత్ ఫిలింస్
నైజాం: కన్నలాల్ సుశీల్ కుమార్ (శ్రీ పద్మ పిక్చర్సు ద్వారా)
మైసూరు: గోకుల్ పిక్చర్సు

SREEKRISHNA PUBLICITIES



టానిక్ ఏదైనా ఆకలిని మాత్రమే పెంచగలిగితే
అది సగం పనిని మాత్రమే చేసినట్లు అవుతుంది




*
ఇన్‌క్రిమిన్ దళంలో చేరండి...
పెరుగుదల నిచ్చు ఆకలి పొందండి!

పెద్ద పిల్లలకు (ఐరన్‌తో కూడిన)
ఇన్‌క్రిమిన్ సిరప్— 175 మి.లీ 57 మి. లీ.
ఇన్‌క్రిమిన్ డ్రాప్స్ పసి బిడ్డలకు 10 మి. లీ.

# *ఇన్‌క్రిమిన్

టానిక్






Lederle

*అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

అన్ని మందుల షాపులలో లభించుచున్నది

లింటాస్ - INC. 21-500 TL


జైశంకర్ అండ్ కంపెనీ వారి
కోడలుపిల్ల
నిర్మాత: నారాయణ శెట్టియార్
దర్శకత్వం:
ఎమ్. మల్లికార్జునరావు
మాటలు:
రాజశ్రీ
సంగీతం:
జి.కె. వెంకటేష్
LAKSHMI

ఇంటిల్లిపాదినీ ఆకర్షించే చక్కని కుటుంబకథా చిత్రం!

కృష్ణ సమర్పించు జయప్రద పిక్చర్స్

# పండంటి కాపురం







राष्ट्रपति भवन, नई दिल्ली-4.
RASHTRAPATI BHAVAN,
NEW DELHI-4.

June 16, 1972.

I am glad to learn that the Chandamama, a well-known children's magazine, is celebrating its Silver Jubilee. I have seen some of the issues of the Chandamama and have found them of considerable educative value to the children. I wish the Chandamama every success.

V. V. Giri

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "చందమామ" తన ఇరవైఆరవ ఏట ప్రవేశిస్తున్నది. లోగడ ప్రచురించిన కొన్ని మంచి కథలను ఈ సంచికలో తిరిగి ముద్రిస్తున్నాము. బేతాళకథల ప్రారంభ కథను అనేక వేల మంది కొత్త పాఠకుల కోసం మళ్ళీ వేస్తున్నాము. ఈ సంచికలో "యక్ష పర్వతం", "మహాభారతం" లేవు. వాటిని పై సంచిక నుంచి యథా ప్రకారం ప్రచురిస్తాము. ఈ నెల నుంచి "చందమామ" బెంగాలీ, ఒరియా భాషలలో కొత్తగా వెలువడుతున్నది.

సంపుటి 51 జూలై '72 సంచిక 1



# అమరవాణి

న సా సభా యత్ర న సన్తి వృద్ధా,
వృద్ధా నతే యే న వదంతి ధర్మమ్,
ధర్మో న వై యత్ర చ నాస్తి సత్యం,
సత్యం న తద్యచ్ఛల నాను విద్ధమ్. 1

[వృద్ధులు లేనిది సభ కాదు. ధర్మము చెప్పని వారు వృద్ధులు కారు. సత్యం లేక ధర్మం లేదు. మోసంతో కూడినది సత్యం కాదు.]

విద్యా దదాతి వినయం;
సా చే దవినయా వహా,
కిం కుర్మః? కస్య వా బ్రూమః?
గరదాయాం స్వ మాతరి! 2

[విద్య వినయాన్ని ఇస్తుంది. తల్లే విషం పెట్టినట్టుగా ఆ విద్యే అవినయాన్ని ఇస్తే ఏం చెయ్యాలి? ఎవరితో చెప్పుకోవాలి?]

రాజవత్ పుత్రదారాశ్చ,
స్వామివత్ మిత్రబాంధవాః,
ఆచార్యవత్ సభామధ్యే
భాగ్యవంతం స్తువంతి హి. 3

[భాగ్యవంతుణ్ణి భార్యా బిడ్డలు రాజులాగా చూస్తారు, బంధుమిత్రులు యజమానిలాగా చూస్తారు, సభలో సభికులు గురువులాగా చూస్తారు.]

---

సంబంధాలు

---




# సంజ్ఞల పండితుడు

పూర్వం కాంచీపురంలో ఒక పండితుడు ఉండేవాడు. ఆయనను అందరూ "సంజ్ఞల పండితుడు" అని పిలిచేవారు. మనుష్యులు తమ అభిప్రాయాలను మాటలతో తెలుపుకునే కంటె సంజ్ఞల ద్వారా తెలియజెప్పు కోవటం మంచిదని ఆయన ప్రచారం చేస్తూ ఉండేవాడు. ఒకనాడు ఆయన రాజు దగ్గరకు వెళ్ళి యీ సంగతే చెప్పాడు.

రాజు పండితుడి వాదన విని లోలోపల నవ్వుకుని, "ఈ సంగతి చెప్పేందుకు మీరు నా దగ్గరకు పనికట్టుకుని వచ్చారా? నేను చాలా కాలం కిందటే ఒక సంజ్ఞలశాస్త్రిని శివగంగపురం పాఠశాలలో నియమించాను," అన్నాడు.

రాజు హాస్యానికి అన్న ఈ మాటలను పండితుడు నిజమనుకున్నాడు.

"మహారాజా, మీరు చాలా దూరదృష్టి గలవారు. చిన్నతనం నుంచీ మనుష్యులకు ఈ సంజ్ఞాశాస్త్రం బోధించటంవల్ల చాలా మేలు జరుగుతుంది. నేను ఆ సంజ్ఞల శాస్త్రి దర్శనం చేసుకుని వస్తాను. సెలవు!" అంటూ సంజ్ఞల పండితుడు రాజుకు నమస్కారం చేసి, శివగంగపురం బయలు దేరాడు.

ఆ తరవాత ఒకటి, రెండు రోజులకు సంజ్ఞల పండితుడు శివగంగపురం చేరాడు. అక్కడి పాఠశాలాధికారులు అతన్ని తగిన విధంగా సత్కరించి, వచ్చినపని తెలుసుకుని, "అయ్యా, మా శాస్త్రిగారు దేశాటనం వెళ్ళి నెల రోజు లయింది. ఇంతలో తిరిగి రారు," అని చెప్పారు.

"సరే, ఇంతదూరం వచ్చి ఆయనను కలుసుకోకుండా ఎలా తిరిగి వెళ్ళేది? ఆయన దేశాటన ముగించుకుని వచ్చే వరకూ యిక్కడే ఉంటాను," అన్నాడు సంజ్ఞల పండితుడు.

సి. కృష్ణమాచార్యులు

ఈ పండితుడు ఒకపట్టాన వదిలేరకం కాదని తెలుసుకుని పాఠశాలాధికారులు ఒక ఆలోచన చేశారు. పాఠశాలకు సంబంధించిన సేవకుడు ఒకడు ఒంటికన్ను వాడున్నాడు. పాఠశాలాధికారులు వాడికి పండిత వేషం వేసి, "ఆ పండితుడు సంజ్ఞలద్వారా నిన్ను ప్రశ్నలు వేస్తాడు. నువు కూడా సంజ్ఞలతోనే సమాధానం చెప్పు. ఏ పరిస్థితిలోనూ నోరు మెదపకు!" అని హెచ్చరించారు.

తరవాత వాళ్ళు సంజ్ఞల పండితుడితో, "అయ్యా, మా సంజ్ఞలశాస్త్రిగారు దేశాటన ముగించుకుని తిరిగి వచ్చారు. ఆ గదిలో ఉన్నారు. తమరు వారిని కలుసుకోవచ్చు," అని చెప్పారు.

సంజ్ఞల పండితుడు సరేనని గదిలోకి వెళ్ళాడు. అక్కడ ఆయనకు, పండిత శాలువా తలకు నిండుగా చుట్టుకుని కూర్చున్న ఒంటికంటివాడు కనిపించాడు.

సంజ్ఞల పండితుడు వాడికి ఎదురుగా కూర్చుని, ఒంటి కంటి వాడికి ఒక వేలు చూపించాడు.

అందుకు సమాధానంగా ఒంటి కంటి వాడు రెండువేళ్ళు చూపించాడు.

తిరిగి సంజ్ఞల పండితుడు మూడువేళ్ళు చూపించాడు. అది చూసి ఒంటికంటి వాడు కోపంతో పిడికిలి బిగించి చూపాడు.

అప్పుడు సంజ్ఞల పండితుడు నవ్వుతూ, తన వద్దవున్న గంగరేగుపండును ఒంటి కంటివాడికి చూపాడు.



ఒంటి కంటి వాడు రొట్టె ముక్కనొక దానిని తీసి సంజ్ఞల పండితుడికి చూపించాడు.

వెంటనే సంజ్ఞల పండితుడు లేచి, ఒంటి కంటి వాడికి నమస్కారం చేసి, గది బయటికి వచ్చాడు.

అక్కడ వేచివున్న పాఠశాలాధికారులు సంజ్ఞలపండితుడితో, "అయ్యా, మా సంజ్ఞల శాస్త్రిగారిని గురించి మీ అభిప్రాయం ఏటిమి?" అని అడిగారు.

అందుకు సంజ్ఞలపండితుడు ఇలా అన్నాడు:

"మీ సంజ్ఞలశాస్త్రిగారు చాలా సమర్థుడు! గొప్ప తత్వవేత్త అన్నది కూడా గ్రహించాను. దేవుడు ఒకడే అని చెప్పటానికి నేను ఒక వేలు ఎత్తి చూపాను. కాదు, శివకేశవులు ఇద్దరు అని, ఆయన రెండువేళ్ళు చూపాడు. అలా అనుకున్నట్టయితే, బ్రహ్మతో కలిసి త్రిమూర్తులు ముగ్గురు గదా అని నేను మూడువేళ్ళు చూపాను. కాని ఆయన పిడికిలి బిగించి, ముగ్గురూ ఒకటే అని తెలియబరిచాడు.

"అప్పుడు నేను, దేవుడు పరమదయాళువు అని చెప్పటానికి గాను, ఆయన మానవకోటికి ప్రసాదించిన అత్యంత స్వాదు ఫలాలలో గంగరేగుపండు ఒకటి గనక, నా వద్ద ఉన్న గంగరేగుపండును తీసి చూపాను.

"అయితే, తత్వవేత్త అయిన మీ శాస్త్రిగారు తన వద్ద ఉన్న రొట్టెముక్కను నాకు చూపి, భగవద్దత్తమూ, అందరికీ ఎల్లవేళలా లభించనిదీ అయిన గంగరేగుపండు కంటే,



మానవకృషి ఫలితమూ, సర్వజనోప యుక్తమూ అయిన రొట్టెముక్క మేలని తెలియ జెప్పాడు. అందులోని పరమార్థం గ్రహించాను."

సంజ్ఞల పండితుడు ఇలా చెప్పి, వెళ్ళి పోయాడు.

అప్పుడు పాఠశాలాధికారులు ఒంటి కంటి సేవకుణ్ణి పిలిచి, ఏమి జరిగిందని అడిగారు.

ఒంటి కన్నువాడు ఇలా చెప్పాడు:

"అయ్యా, ఈ పండితుడు చాలా దుర్మార్గుడులా ఉన్నాడు. ఆయన గదిలోకి వస్తూనే నన్ను వెటకారం చెయ్యటానికి ఒక వేలు ఎత్తి, 'నీది ఒంటి కన్నుగదా?' అని సంజ్ఞతో అడిగాడు.

"అందుకు నేను కోపగించుకోక, 'నీ రెండు కళ్ళకన్న నా ఒంటి కన్నే మంచి' దని తెలుపుతూ రెండువేళ్ళు చూపించాను.

"అంతటితో వదలక ఆ పండితుడు తన రెండు కళ్ళూ, నా ఒంటి కన్నూ కలిస్తే మూడవుతాయని తెలిపేందుకు మూడువేళ్లు చూపించాడు.

"ఆయనగారి మీద నాకు చాలా కోపం వచ్చింది. మరోసారి ఆ మాట ఎత్తితే ముక్కు చితక గొడతానని పిడికిలి బిగించి చూపాను.

"ఆ దెబ్బతో ఆ దుర్మార్గుడు బెదిరి పోయి, నన్ను మంచి చేసుకునేటందుకు, తన దగ్గిర ఉన్న గంగరేగుపండును నాకు లంచం పెట్ట జూపాడు.

"నేను ఆ లంచానికి ఆశపడక, 'నీ రేగు పండు ఎవడికి కావాలి? నా దగ్గిర ఉన్న రొట్టెముక్క ముందు నీ పండు దిగదుడుపే కదా?' అని చెప్పటానికి నా రొట్టెముక్క చూపించాను.

"దానితో ఆ దుర్మార్గుడు, తన పప్పులు నా దగ్గిర ఉడకవని తెలుసుకుని, ఒక్క దణ్ణం పెట్టి, పారిపోయాడు."

పాఠశాలాధికారులు ఈ రెండు వ్యాఖ్యా నాలూ విని ఎంతో ఆనందించారు. జరిగిన దంతా రాజుగారికి కబురు చేయగా ఆయన విరగబడి నవ్వాడు.





# నిజమైన లక్ష్మి

పూర్వం ఉజ్జయినీనగరాన్ని ధీమంతుడనే రాజు పాలించేవాడు. ఆయనకు మహారాజులకు ఉండవలసిన అష్టఐశ్వర్యాలూ ఉండేవి.

ఒకనాడు ధీమంతుడి వద్దకు ఒక జోగి వచ్చాడు.

జోగిని చూసి రాజు, "నీకు ఏం కావాలి?" అని అడిగాడు.

"మహారాజా, నా దగ్గిర ఒక ఇనపలోటా, ఒక కర్రా ఉన్నాయి. వాటిని తమకు అమ్మి డబ్బు తీసుకుపోదామని వచ్చాను," అన్నాడు జోగి.

"ఎంతకు అమ్ముతావు?" అన్నాడు రాజు.

"వాటిని తీసుకుని ఒక లక్ష రూపాయలు ఇయ్యండి," అన్నాడు జోగి.

రాజు వెనకా ముందూ ఆలోచించకుండా, మంత్రులు మొదలైనవారు వద్దంటున్నా వినిపించుకోకుండా, జోగికి లక్ష రూపాయలూ ఇప్పించి, ఆ రెండు వస్తువులూ తన భాండారంలో పెట్టించాడు.

ఆ రాత్రి ధీమంతుడు పడుకోగానే ఆయనకు ఒక కల వచ్చింది. ఒక స్త్రీ, సమస్తాభరణాలూ ధరించి, రాజభవనంలో నుంచి బయటికి వెళ్ళిపోతూండటం రాజు చూశాడు.

"ఎవరు నీవు?" అని ఆయన ఆమెను అడిగాడు.

"నేను ధనలక్ష్మిని," అన్నదామె.

"ఎందుకు వెళ్ళిపోతున్నావు?" అని రాజు అడిగాడు.

"లక్ష రూపాయలిచ్చి ఒక జోగి దగ్గిర, ఎందుకూ పనికిరాని ఇనపలోటా, కర్రా కొని, నన్ను అపమానించావు. నీ ఇంట ఒక్క క్షణం కూడా ఉండను," అన్నది ధనలక్ష్మి.

"అవశ్యం వెళ్ళు!" అన్నాడు రాజు నిర్లక్ష్యంగా.

ఆర్. శకుంతల

రెండో జామున రాజుకు కలలో మరొక స్త్రీ బయటికి వెళ్ళిపోతూ కనిపించింది. ఆమె ఒడ్డూ, పొడుగూ ఉండి, మంచి యౌవనంలో ఉన్నది. "ఎవరు నీవు?" అన్నాడు రాజు.

"నేను బలలక్ష్మిని!" అన్న దామె.

"ఏం పోతున్నావు?" అన్నాడు రాజు.

"నిన్ను ధనలక్ష్మి విడిచింది. ఇక నన్ను ఎంతకాలం దక్కించుకో గలవు? నేనూ వెళ్ళిపోతున్నాను!" అన్నది బలలక్ష్మి.

"వెళ్ళు!" అన్నాడు రాజు నిశ్చింతగా.

మళ్ళీ మూడో జామున రాజుకు కలలో ఒక వృద్ధురాలు కనిపించింది. ఆమె కూడా రాజసౌధం నుంచి వెళ్ళిపోతున్నది. ఆమె తల నెరిసి ఉన్నది; కాని ఆమె ముఖం కళకళలాడుతున్నది.

"ఎవరు నీవు?" అన్నాడు రాజు.

"నేను జ్ఞానలక్ష్మిని!" అన్నదామె.

"ఏం పోతున్నావు?" అన్నాడు రాజు.

"ధనలక్ష్మి, బలలక్ష్మి పోయాక నా కిక్కడ ఏం చోటు ఉన్నది? నేను కూడా వెళ్ళిపోతున్నాను," అన్నది జ్ఞానలక్ష్మి.

"అవశ్యం వెళ్ళు!" అన్నాడు రాజు నిబ్బరంగా.

తిరిగి నాలుగో జామున రాజుకు కలలో ఒక దేవతా స్త్రీలాటిది రాజసౌధం వదిలి వెళ్ళిపోతూ కనిపించింది.

"నీ వెవరు?" అని రాజు అడిగాడు.

"నేను ధైర్యలక్ష్మిని!" అన్నదామె.

రాజు ఆమె దారికి అడ్డునిలిచి, "నువు ఎందుకు వెళ్ళిపోతున్నావు?" అని అడిగాడు.

"అందరూ నిన్నువదిలి వెళ్ళిపోతున్నారు. నేను మాత్రం ఇంక నీ వద్ద ఎందుకు?" అన్నది ధైర్యలక్ష్మి.

రాజు చప్పున ఆమె చెయ్యిపట్టుకుని, "నువు వెళ్ళటానికి వీలులేదు. నీ అండ చూసుకునే మిగిలిన లక్ష్ములు వెళ్లిపోతున్నా నేను లక్ష్యపెట్టలేదు! నువు ఉంటే నాకు చాలు!" అన్నాడు.

ధైర్యలక్ష్మి నవ్వి, "సరే అయితే, నేను నీ దగ్గిరే ఉండి పోతానులే!" అన్నది. రాజు సంతోషంతో నిద్రలేచాడు.





# బేతాళకథలు

గోదావరీతీరాన ప్రతిష్ఠాన మనే నగరం ఉండేది. దానిని ఒకప్పుడు విక్రమార్కు డనే రాజు పాలించేవాడు.

విక్రమార్కుడి ఆస్థానానికి రోజూ క్షాంతి శీలు డనే భిక్షువు వచ్చి, పండు ఒకటి కానుకగా ఇస్తూ ఉండేవాడు. రాజు ఆ పండును కోశాధికారికి ఇస్తూ ఉండేవాడు.

ఒకనాడు భిక్షువు తన అలవాటు ప్రకారం రాజుకు ఒక పండు ఇచ్చి వెళ్ళిపోయాడు. ఆ సమయంలో ఒక కోతి ద్వారపాలకులను తప్పించుకుని రాజసభలోకి వచ్చింది. భిక్షువు ఇచ్చిన పండును రాజు ఆ కోతికి ఇచ్చాడు. కోతి ఆ పండును తినేసరికి పండులో నుంచి వెలలేని రత్నం ఒకటి కింద పడింది.

అది చూసి రాజు తన కోశాధికారిని పిలి పించి, "భిక్షువు రోజూ కానుక ఇచ్చే పళ్ళను నీకు ఇస్తున్నానే, వాటిని ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

మొదటిది



ఆ మాటకు భిక్షువు రాజుతో ఏకాంతంగా, "రాజా, నేనొక మంత్రాన్ని సాధించాలి. అందుకు ఒక వీరుడి సహాయం కావాలి. నేను నీ సహాయం కోరుతున్నాను." అన్నాడు. రాజు భిక్షువుకు సహాయం చెయ్యటానికి సమ్మతించాడు.

అప్పుడు భిక్షువు రాజుతో, "రానున్న కృష్ణచతుర్దశి రాత్రి చీకటి పడగానే మహా శ్మశానానికి నువు రావాలి. శ్మశానం మధ్య ఉన్న మర్రిచెట్టు కింద నేను నీ కోసం ఎదురు చూస్తూ ఉంటాను." అన్నాడు.

"అలాగే వస్తాను," అని రాజు మాట ఇచ్చిన మీదట భిక్షువు వెళ్ళిపోయాడు.

ఈ ప్రశ్నకు కోశాధికారి కొంచెం బెదిరి, "మహారాజా, మీరిచ్చిన పళ్ళ నన్నిటినీ కిటికీలో నుంచి కోశాగారంలో పడేస్తున్నాను. తమ సెలవైతే కోశాగారం తలుపు తెరిచి, పళ్ళు ఏమయాయో చూస్తాను." అన్నాడు.

రాజు సరేనన్నాడు. కోశాధికారి వెళ్ళి తిరిగి వచ్చి, "మహారాజా, పళ్ళన్నీ కుళ్ళిపోయాయి. కాని అవి పడిన చోట రత్నాల కుప్ప ధగధగా మెరుస్తున్నది." అనిచెప్పాడు.

రాజు అతని విశ్వాసానికి మెచ్చి, అతన్ని ఆ మణులన్నీ తీసుకోమని, మర్నాడు భిక్షువు వచ్చి పండు ఇయ్యబోతే, "భిక్షూ, రోజూ ఇంత విలువైన కానుక ఎందు కిస్తున్నావు? చెపితేగాని పండు తీసుకోను," అన్నాడు.

కృష్ణచతుర్దశి వచ్చింది. విక్రమార్కుడు తాను భిక్షువుకు ఇచ్చిన మాట జ్ఞాపకం పెట్టుకుని, చీకటి పడగానే నల్లని బట్టలు ధరించి, చేత కత్తి పట్టి, ఎవరికీ తెలియకుండా రాజధాని నుంచి బయలుదేరి శ్మశానానికి వెళ్ళాడు.

శ్మశానమంతా కటిక చీకటిగా ఉన్నది. చితుల మంటలు భయం గొలుపుతున్నాయి. మనుష్యుల ఎముకల గుట్టలూ, పుర్రెలూ అంతటా పడి ఉన్నాయి. భూత బేతాళాలు ఆనందంతో గెంతుతున్నాయి. నక్కల కూతలు మారుమోగు తున్నాయి.

రాజు భిక్షువును వెతుక్కుంటూ శ్మశానం మధ్యకు చేరుకుని, మర్రిచెట్టు కింద

మండలన్యాసం చేస్తున్న భిక్షువును చూసి, "భిక్షూ, నువు కోరిన ప్రకారం వచ్చాను. నా వల్ల ఏమికావాలో చెప్పు," అన్నాడు.

భిక్షువు రాజు రాకకు సంతోషించి, "రాజా, దయచేసి ఇక్కడి నుంచి దక్షిణంగా వెళ్ళు. అక్కడ ఒకే ఒక శింశుపావృక్షం (ఇరుగుడు చెట్టు) ఉంటుంది. దానిమీద ఒక పురుషుడి శవం వేళ్ళాడుతూ ఉంటుంది. దాన్ని ఇక్కడికి తెచ్చి నువు నా సమీపంలోనే ఉండు," అని కోరాడు.

రాజు అందుకు సమ్మతించి, చితిలో కాలే కొరవిని ఒకదాన్ని తీసుకుని, దానిని దివిటీగా పట్టుకుని, దక్షిణంగా వెళ్ళి శింశుపా వృక్షాన్ని చేరుకున్నాడు. సగం కాలి కంపు కొట్టుతున్న శవం చెట్టుమీద కనబడింది. రాజు చెట్టు పైకి ఎక్కి, శవానికి కట్టివున్న తాడును కోసి, ఆ శవాన్ని కింద పడేశాడు.

కింద పడుతూనే ఆ శవం, దెబ్బ తగిలి నొప్పి పెట్టినట్టుగా, ఏడవ సాగింది. దానిలో ప్రాణం ఉన్నది కాబోలు ననుకుని రాజు చెట్టు దిగి వచ్చి, జాలితో శవాన్ని తడివి చూశాడు. వెంటనే అది అట్టహాసం చేసింది.

అందులో బేతాళు డున్న సంగతి తెలియక రాజు దానితో, "ఎందుకు అలా నవ్వుతావు? పోదాం పద!" అన్నాడు.

రాజు ఇలా అనగానే నేలమీది శవం కాస్తా మాయమై, తిరిగి చెట్టు మీద



వేళ్ళాడుతూ కనబడింది. రాజు మళ్ళీ చెట్టెక్కి, శవాన్ని మళ్ళీ కింద పడేసి, బేతాళుడు పూని ఉన్న ఆ శవాన్ని భుజం మీద వేసుకుని, మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు.

అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకు వినోదంగా ఉండటానికి ఒక కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం అంగదేశంలో యశఃకేతుడు అనే రాజు ఉండేవాడు. అతను అందంలో మన్మథుడు. అతను తన పరాక్రమంచేత శత్రువుల నందరినీ ఓడించి, రాజ్యభారాన్ని దీర్ఘదర్శి అనే మంత్రి పైన పెట్టి, అంతః



పురం నుంచి ఇవతలికి రాక తన కాల మంతా భోగవిలాసాలలో గడపసాగాడు.

దీర్ఘదర్శి రాజ్యభారమంతా మోస్తూ, అహోరాత్రాలు ఎంతో శ్రద్ధగా ఉంటూ పరిపాలన సాగిస్తున్నాడు. విశ్వాసపాత్రు డైన దీర్ఘదర్శి పైన కూడా ఓర్వలేనివాళ్ళు అపవాదు వెయ్యనే వేశారు: "ఈ మంత్రి రాజును భోగలాలసలోకి తోసి తాను రాజ్యం అనుభవిస్తున్నాడు," అన్నారు.

ఇది తెలిసి దీర్ఘదర్శి, మేధావిని అనే తన భార్యతో, "రాజు సుఖాలు మరిగినందుకు నేను రాజ్యభారం మోస్తుంటే, రాజ్యం తినేస్తున్నానన్న నింద నా మీద వచ్చింది. అబద్ధమే అయినా లోకనిందను ఉపేక్షించ రాదు. నన్ను ఏం చెయ్యమన్నావు?" అన్నాడు.

దానికి మేధావిని తన భర్తతో, "మీరు తీర్థయాత్రల మిషమీద, రాజుతో చెప్పి దేశాటనకు బయలుదేరండి. అందువల్ల మీమీద అపవాదు పోవటమేగాక, రాజు తానే రాజ్యం చూసుకోవలిసి వస్తుంది గనక, ఆయన భోగలాలస తగ్గిపోతుంది," అన్నది.

దీర్ఘదర్శి అవకాశం చూసుకుని రాజుతో, "మహారాజా, నేను కొంతకాలం తీర్థ యాత్రలు చేసి ఇంత పుణ్యం సంపాదించు కుంటాను. తమరు అనుమతించాలి," అన్నాడు. ఇంటి దగ్గిరే కూర్చుని పుణ్యం సంపాదించరాదా అన్నాడు రాజు. శరీరంలో పటుత్వం ఉండగానే తీర్థయాత్రలు చేయా లనీ, వయసు మళ్ళినాక అది సాధ్యం కాదనీ మంత్రి చెప్పాడు.

దీర్ఘదర్శి తనవెంట భార్యను రానివ్వక, మిగిలిన వారికెవ్వరికీ తాను బయలుదేరు తున్నట్టయినా చెప్పక, తీర్థయాత్రలకు బయలుదేరాడు. కొంత కాలానికి ఆయన సముద్ర తీరాన గల పుండ్రదేశం చేరాడు. అక్కడ ఆయనకు నిధిదత్తు డనే వర్తకుడితో స్నేహం కలిసింది. నిధిదత్తుడు వర్తకం మీద సువర్ణద్వీపం వెళుతున్నాడని తెలిసి తాను కూడా వస్తానని దీర్ఘదర్శి అన్నాడు. ఇద్దరూ వర్తకనౌకలో ప్రయాణమయారు.

వాళ్ళు సువర్ణద్వీపం చేరారు. అక్కడ కొన్ని రోజులపాటు వర్తకం జరిగింది.

తిరుగు ప్రయాణంలో దీర్ఘదర్శి సముద్ర మధ్యంలో ఒక అద్భుతం చూశాడు. ఒక అద్భుత వృక్షం పైకి లేచింది, దాని మాను బంగారం, కొమ్మలు పగడాలు, కాయలు రత్నాలు. ఆ వింత వృక్షం పైన రత్నాల పాన్పు మీద ఒక అతిలోక సుందరి కూర్చుని పాడుతున్నది. దీర్ఘదర్శి చూస్తూండగానే ఆ చెట్టూ, సుందరి కూడా సముద్రంలోకి దిగిపోయారు.

"ఇదేమి విచిత్రం!" అన్నాడు దీర్ఘదర్శి.

ఆయన ఆశ్చర్యం చూసి నావికులు, "మీకిది కొత్త గనక ఆశ్చర్యపడుతున్నారు గాని, మేము ఈ ప్రాంతాల ఈ దృశ్యాన్ని ప్రతిసారీ చూస్తూనే ఉంటాం," అన్నారు.

తిరుగు ప్రయాణం ముగిసినాక దీర్ఘదర్శి వర్తకుడి వద్ద సెలవు పుచ్చుకుని, అంగ దేశానికి తిరిగివచ్చాడు.

దీర్ఘదర్శి, తాను సరే ననకుండానే యాత్రలకు బయలుదేరటంచేత, యశః కేతుడు ఆయన కోసం ఇంతకాలమూ వెతికి స్తున్నాడు. ఆయన నియమించిన చారులు దీర్ఘదర్శిని నగరం బయటనే చూసి, చప్పున వెళ్ళి రాజుతో చెప్పారు. యశఃకేతుడు ఎదురు వెళ్ళి, దీర్ఘదర్శిని కౌగలించుకుని తన అంతఃపురానికి తీసుకుపోయి, "ఏయే



తీర్థాలు సేవించావు? ఏమేమి వింతలు చూశావు?" అని అడిగాడు.

దీర్ఘదర్శి జరిగినదంతా రాజుకు తెలిపి, సువర్ణద్వీపం నుంచి తిరిగి వచ్చేటప్పుడు సముద్ర మధ్యంలో కనిపించిన దివ్య సుందరిని గురించి చెప్పాడు.

రాజుకు వెంటనే ఆ కన్య మీద మనసు పోయింది. ఆయన దీర్ఘదర్శితో ఏకాంతంగా, "నేనా దివ్యసుందరిని చూసి తీరాలి. లేక పోతే నా ప్రాణాలు నిలవవు. నువు నాకు అభ్యంతరం చెప్పకు. నేను ఒక్కణ్ణే బయలుదేరి పోతాను. ఈలోపల నా రాజ్యం నువు చూస్తూ ఉండు. కాదంటే నా మీద ఒట్టే!" అన్నాడు.



మర్నాడే యశఃకేతుడు తన రాజ్యాన్ని మంత్రికి అప్పగించి, రాత్రివేళ బయలుదేరాడు. ఆయన సముద్ర తీరం చేరుకున్నాడు. అక్కడ లక్ష్మీదత్తు అనేవాడు రాజుకు తారసపడి, తాను సువర్ణద్వీపానికి వర్తకం నిమిత్తం బయలుదేరుతూ, రాజును కూడా తీసుకుపోయాడు.

వారి ఓడ సముద్ర మధ్యం చేరేసరికి పూర్వంలాగే వింత వృక్షం పైకి వచ్చింది. ఆ చెట్టు మీద ఒక దివ్యసుందరి వీణతో సహా పాడుతూ రాజు కంటపడింది.

ఆమెను చూడగానే రాజు మోహంలో పడి, "సముద్రుడా, ఈమెను దాచి, లక్ష్మిని చూపి విష్ణువును మోసగించావా?" అనుకుంటూండగా, ఆ సుందరితో సహా చెట్టు సముద్రంలోకి దిగిపోయింది. వెంటనే రాజు కూడా సముద్రంలో దూకేశాడు.

సముద్రం అడుగున ఆయనకు ఒక మహా నగరం కనిపించింది. అక్కడ ఒక్క ప్రాణి కూడా లేదు. అయినా రాజు పట్టుదలతో నగరమంతా తిరిగి ఒక విశాల భవనాన్ని చూసి, అందులో ప్రవేశించాడు. అక్కడ ఒక గదిలో హంసతూలికా తల్పం మీద ఆ దివ్యసుందరి పడుకుని ఉన్నది.

రాజును చూడగానే ఆమె పాన్పు మీది నుంచి దిగి, "మీరెవరు? ఈ రసాతలానికి ఎలా వచ్చారు?" అన్నది.

"సుందరీ, నేను అంగరాజును. నా పేరు యశఃకేతుడు. నిన్ను గురించి ఒక మిత్రుడు చెప్పగా విని, నీ కోసం రాజ్యం వదిలిపెట్టి, నిన్ను చూసి సముద్రంలో దూకి ఇక్కడికి చేరాను. నువు ఎవతెవు?" అన్నాడు రాజు.

"నేను మృగాంకసేను అనే విద్యాధరుడి కుమార్తెను. నా పేరు మృగాంకవతి. నా తండ్రి నన్నిక్కడ ఒంటరిగా వదిలి, ఎందుకో, ఎక్కడికో, మిగిలిన పౌరులతో సహా వెళ్ళిపోయాడు. ఇక్కడ ఉన్న కల్పవృక్షం ఎక్కి, అప్పుడప్పుడూ సముద్రం పైకి లేస్తూ ఉంటాను," అన్నదామె.

రాజు ఆమెను తియ్యని మాటలతో కరిగించి, తన భార్య కావటానికి ఒప్పించాడు.



ఆమె ఒక షరతుమీద అతనికి భార్య కావ టానికి ఒప్పుకుంటూ ఇలా అన్నది: "ప్రతి నెలా రెండు అష్టమి దినాలూ, రెండు చతుర్దశి దినాలూ నేను నీ అధీనంలో ఉండను. ఆ నాలుగు రోజులూ నేనెక్కడికో పోతాను. ఎక్కడికని నన్ను అడగరాదు."

రాజు ఈ నిబంధనకు ఒప్పుకున్నాడు. ఒకనాడు మృగాంకవతి రాజుతో, "నేనొక పని మీద ఎక్కడికో పోతున్నాను. నేను వచ్చే దాకా ఇక్కడే ఉండు. ఇక్కడ ఉన్న బావిలో మాత్రం దిగకు. దిగితే భూలోకానికి పోతావు." అని హెచ్చరించి బయలుదేరింది.

ఆమె ఎక్కడికి పోతున్నదో తెలుసుకో గోరి ఆమె వెనకగా బయలుదేరాడు రాజు. ఆయన చూస్తూ ఉండగానే ఒక బ్రహ్మాండ మైన రాక్షసుడు వచ్చి మృగాంకవతిని మింగే శాడు. రాజు తీవ్రమైన కోపంలో కత్తి దూసి రాక్షసుడి తల నరికేశాడు. కోపం చల్లారినా తన ప్రియురాలు పోయిందన్న బాధ అతనికి మిగిలింది.

ఇంతలో రాక్షసుడి శరీరాన్ని చీల్చుకుని మృగాంకవతి బయటికివచ్చింది. "ప్రియు రాలా, ఇది స్వప్నమా? మాయా?" అని రాజు అడిగాడు.

"ఏదీ కాదు. ఇది నా తండ్రి శాపం. నా తండ్రి నేను వెంట లేకుండా భోజనం చేసేవాడు కాదు. నేను ప్రతి చతుర్దశి నాడూ, అష్టమినాడూ శివపూజ చేయబోయే దాన్ని. ఒక చతుర్దశినాడు గౌరీపూజ చేసు కుంటూ రోజంతా గడిపేశాను. నా కోసం కని పెట్టుకుని ఉండి నా తండ్రి ఒక్క నీటి చుక్క అయినా తాగ లేదు. నన్ను చూడ గానే ఆయన ప్రతి చతుర్దశినాడూ, అష్టమి నాడూ నన్ను ఈ రాక్షసుడు మింగాలనీ, నేను అతని పొట్ట చీల్చుకుని బయటికి రావాలనీ శాపం పెట్టి, ఆ రాక్షసుణ్ణి ఎవ రన్నా చంపినప్పుడు నాకు శాపవిమోచనం కలుగుతుందనీ, విద్యలన్నీ తిరిగి వస్తాయనీ చెప్పాడు. నా శాపం తీరిపోయింది. నాకు విద్యలన్నీ తిరిగి వచ్చాయి. జరిగినదంతా జ్ఞాపకం వచ్చేసింది. ఇక నీ దారి నీదీ,

నా దారి నాదీనూ. నేను నా తండ్రి దగ్గిరికి పోతున్నాను." అన్నది మృగాంకవతి.

ఈ మాట విని రాజుకు దుఃఖం ముంచుకు వచ్చి, తనతో ఒక వారం ఉండి వెళ్ళమని ఆమెను బతిమాలుకున్నాడు. ఆమె సరే నన్నది. ఆరు రోజులు వారిద్దరూ ఆ ప్రాంతమంతా విహారాలు చేశారు. ఏడవ రోజున ఆయన ఆమెను బావి వద్దకు తీసుకు వచ్చి, ఆమెను కౌగలించుకుంటూ గట్టిగా పట్టుకుని. ఆమెతో సహా ఆ బావిలోకి దూకేశాడు.

వారిద్దరూ యశఃకేతుడి నగరంలోని బావిలో తేలారు. భూలోకంలోకి చేరగానే మృగాంకవతికి విద్యాధరత్వం పోయి మామూలు మనిషి అయిపోయింది. రాజు ఆమెతో సహా తన మందిరం ప్రవేశించి, ఆమె మామూలు మనిషి అయిందని తెలుసుకుని పరమానందం చెందాడు.

ఇదంతా కళ్ళారా చూసిన దీర్ఘదర్శి తన ఇంటికి తిరిగిపోయి, ఆ రాత్రి పడుకుని, గుండె ఆగిపోయి చచ్చాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, దీర్ఘదర్శి ఎందుకు చచ్చాడు? వెళ్ళిపోయాడనుకున్న రాజు తిరిగి వచ్చి తన ఏలుబడికి విఘ్నం కలిగించాడనా? తాను చూసి కూడా పెళ్ళాడలేని అందగత్తెను రాజు పెళ్ళాడాడనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దీర్ఘదర్శి చావుకు నువ్వు చెప్పినది ఏదీ కారణం కాదు. మామూలు భోగాలలో మునిగి ఉన్నప్పుడే రాజ్యభారమంతా తన మీద వేసి తనను అపనిందలకు గురి చేసిన యశఃకేతుడు ఈ దేవతా స్త్రీ దొరికినాక తిరిగి రాజ్యభారం వహిస్తాడా, తాను యావజ్జీవం అపనిందలపాలుకాక తప్పదన్న విచారంతో దీర్ఘదర్శి గుండె పగిలి చచ్చాడు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.





# గెలుపు మాదే!

అరేబియాలోని ఒక గ్రామంలో అలీ మహమ్మద్ అనేవాడు ఒకడు ఉండేవాడు. అతను సాధువు; ఎన్నడూ ఒకరి జోలికి సొంటికీ పోయేవాడు కాడు. ఆ కారణం చేత అతను అమాయకుడని అందరూ అనుకునేవారు.

ఒకరోజు అతని మిత్రులిద్దరు అతనితో దయ్యాలు ఉంటాయన్నారు. దయ్యాలూ, భూతాలూ ఏమీ లేవని అలీ మహమ్మద్ అన్నాడు. ఊరికి పడమరగా ఉన్న కొండ మీది జువ్విచెట్టు నిండా దయ్యాలూ, భూతాలూ ఉన్నాయని అలీ మిత్రులు వాదించారు.

"నేను నమ్మను. అదంతా శుద్ధ అబద్ధం!" అన్నాడు అలీ.

"అనగానే అయిపోయిందా ఏమిటి? అమావాస్య రాత్రి కటిక చీకటిలో నువు ఒంటరిగా ఆ చెట్టు కింద గడపగలవా?" అన్నారు మిత్రులు.

"గడపగలను, నా కేమీ భయం లేదు," అన్నాడు అలీ.

"అయితే, రేపే అమావాస్య. రేపు రాత్రి తెల్లవార్లూ గాఢాంధకారంలో కొండమీది దయ్యాల జువ్విచెట్టు కింద కూర్చో. కూర్చున్నావంటే నీకు విందుభోజనం పెట్టిస్తాం. లేని పక్షంలో నువు మాకు విందు చెయ్యాలి," అన్నారు అలీ మిత్రులు.

అలీ అందుకు సమ్మతించాడు.

మర్నాడు సాయంకాలం ముగ్గురు స్నేహితులూ కంచరగాడిద లెక్కి కొండ మీదికి వెళ్ళారు. చీకటి పడే సమయానికి అలీని జువ్విచెట్టు కింద వదిలిపెట్టి, అతని కంచరగాడిదతో సహా అతని స్నేహితులు గ్రామానికి తిరుగుముఖం పట్టారు.

వెళ్ళిపోయేటప్పుడు వారు అలీతో, "అనుకున్న నియమాలన్నీ విధిగా పాటించాలి సుమా! రేపు ఉదయమే నీకోసం వస్తాం.

కె. రమణారావు



అప్పటి దాకా నువు బతికి ఉంటే మనం తిరిగి కలుసుకుందాం. సరేనా?" అని నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

కొండ చాటున ఉండటం వల్ల అప్పటికే గ్రామంలో బాగా చీకటి పడింది. క్రమంగా ఒక్కొక్క ఇంటా దీపాలు వెలిగాయి. కొద్దిసేపట్లో చలి ఆరంభమయింది. మంచు కూడా పడసాగింది.

అలీకి చలి బాధా, ఆకలి బాధా ఎక్కువ కాసాగింది.

"ఈ బాధలతో పోలిస్తే దయ్యాల బాధ ఏ పాటిది? తెల్లవారి పందెం గెలవగానే ముగ్గురు తినే తిండి ఒక్కణ్ణే తినేస్తాను!" అనుకున్నాడు అలీ.

రాత్రి గడుస్తున్నకొద్దీ ఒక్కొక్క ఇంటి దీపాలూ ఆరిపోసాగాయి. చివరకు ఒక మేడ గదిలో దీపం మాత్రమే ఆరక పోవటం అలీ గమనించాడు. ఆ గదిలో ఎవరు మేలుకుని ఉన్నారో, ఎందుకు మేలుకుని ఉన్నారో ఊహించటానికి ప్రయత్నిస్తూ, ఆకలిబాధా, చలిబాధా మరిచిపోదామని అలీ అనుకున్నాడు. ఎందుచేతనో గాని ఆ ఒక్క దీపమూ తెల్లవార్లూ అలా వెలుగుతూనే ఉన్నది.

ఎలాగైతేనేం, తెల్లవారింది. అలీ మిత్రులు మూడు కంచరగాడిదెలను వెంటబెట్టుకుని కొండమీదికి వచ్చారు.

"ఆకలి దహించుకుపోతోంది. పందెం గెలిచాను గనక నాకు వేగిరం విందుభోజనం పెట్టించండి," అన్నాడు అలీ వారితో.

"కాస్త గుర్రాన్ని కట్టెయ్యి! మనం అనుకున్న నియమాలన్నిటినీ నువు పాటించి ఉంటేనే మేం ఓడిపోయినట్టు! లేని పక్షంలో నువే ఓడిపోయావు," అన్నారు మిత్రులు.

"తెల్లవార్లూ చీకటిలో ఈ జువ్విచెట్టు కింద గడిపాను గదా! ఇంకేం నియమాలు పాటించాలి?" అని అలీ అన్నాడు.

"సరిగా ఆలోచించు! తెల్లవార్లూ గాఢాంధకారంలోనే ఉన్నావా?" అని మిత్రులు అడిగారు.

"నా దగ్గిర దీపం లేందే?" అన్నాడు అలీ, వాళ్ళను అనుమానంతో చూస్తూ.



"నీ దగ్గిర లేకపోతే సరా? గతరాత్రి ఊళ్ళో ఒక మేడ గదిలో తెల్లవార్లూ ఒక కొవ్వొత్తి వెలిగినట్లు మాకు తెలియవచ్చింది. దాని కాంతి నీకుగాని కనిపించలేదు కద?" అన్నారు వాళ్ళు.

అలీ ఆశ్చర్యపోతూ "మీరన్న మాట నిజమే!" అన్నాడు.

"మరేం? నువు ఓడిపోయావు. ఇప్పుడు మాకే నువు విందుభోజనం పెట్టించాలి." అన్నారు మిత్రులు.

"ఎక్కడో మైలు దూరాన ఎవరో కొవ్వొత్తి వెలిగిస్తే దాని కాంతి నాకు సాయపడిందా?" అన్నాడు అలీ నిర్ఘాంతపోయి.

"మైలు అయేది, రెండు మైళ్ళు అయేది. నీకు తెల్లవార్లూ ఆ కాంతి కనిపించినప్పుడు నువు గాఢాంధకారంలో ఉన్నట్టు ఎలా అవుతుంది?" అన్నారు మిత్రులు.

తనను మోసగించటానికి వారే తెల్లవార్లూ ఆ కొవ్వొత్తి వెలిగించి, దాని కాంతి తనకు కనిపించేలాగా చేశారని అలీ గ్రహించాడు. అతను తన మిత్రులతో, "సరే, నేను పందెం ఓడానని అంటున్నారు గనక, భోజనాల వేళకు మా యింటికి రండి. మీ ఇద్దరికీ విందు భోజనం పెడతాను." అని తన ఇంటికి వెళ్ళిపోయాడు.

అమాయకుడైన అలీని మోసం చేసి విందు భోజనం చెయ్యబోతున్నామన్న ఆనందంలో అతని మిత్రులు తమ ఇళ్ళకు వెళ్ళిపోయి, భోజనాల వేళకు అతని ఇల్లు చేరుకున్నారు. ఈ లోపుగా అలీ తన భోజనం ముగించేశాడు.

అలీ తన ఇంటికి వచ్చిన మిత్రులకు ఆదరపూర్వకంగా స్వాగతం తెలిపి, వారిని కూర్చోబెట్టి, లోకాభిరామాయణం ప్రారంభించాడు. చాలా సేపు సంభాషణ జరిగాక అతిథులు, "ఇంతకీ వంట ఇంకా కానేలేదా ఏమిటి?" అని అడిగారు.

అలీ చప్పున లోపలికి వెళ్ళి వచ్చి, "ఇంకా కాలేదు." అన్నాడు.

మళ్ళీ కాస్సేపు ముచ్చట్లు జరిగాయి. అలీ మరొకసారి లోపలికి వెళ్ళి వచ్చి, "వంట అవుతోంది!" అన్నాడు.

సూర్యుడు నడి నెత్తి కెక్కాడు. విందు భోజనానికి వచ్చిన అలీ మిత్రులకు ఆకలి దహించసాగింది. అలీ లోపలికి వెళ్ళి వస్తూ, ప్రతిసారీ, "వంట కావస్తోంది, అవుతోంది," అన్నాడే గాని ఎంతట్లో అయేదీ మాత్రం వాళ్ళకు చెప్పలేదు.

చివరకు అలీ మిత్రులలో ఒకడు పట్ట లేక, "అయిన ఆలస్యం కానే అయింది. పదార్థాలయినా మంచివి చేయిస్తున్నావా?" అని అలీని అడిగాడు.

అలీ తాను వండుతున్న మాంసాలూ, కూరలూ ఏకరు పెట్టాడు. అతిథులు సంతో షించి, మళ్ళీ మాటలలో పడ్డారు. క్రమంగా అపరాహ్ణమయింది. అలీ మరొకసారి లోప లికి వెళ్ళి వచ్చి, "ఇదుగో, అవుతోంది!" అన్నాడు.

అలీ స్నేహితులు ఇక భరించలేక పోయారు.

"ఏదీ? నువు చేసే వంట మాకు కాస్త చూపించు. లేకపోతే మాకు తృప్తి ఉండదు," అన్నారు వాళ్ళు.

"నా మాట నమ్మకపోతే మీరు స్వయంగా వచ్చి చూసుకోండి," అంటూ అలీ తన అతిథులను వంట ఇంట్లోకి తీసుకుపోయాడు.

పొయ్యి మీద ఒక పెద్ద బానలో అలీ చెప్పిన మాంసాలూ, కూరలూ ఉన్నమాట నిజమే. కాని, ఏం చెప్పాలి? బాన కింద కట్టెలూ లేవు, మంటా లేదు — కేవలం ఒకే ఒక కొవ్వొత్తి వెలుగుతోంది!

"అరె, ఇంతసేపూ మా వంట ఈ కొవ్వొత్తితో చేస్తున్నావా? ఈ వంట ఎప్పటికి కాను? మోసం!" అన్నారు అలీ మిత్రులు.

"స్నేహితులారా, మీ మాటలు నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. మైలు దూరం నుంచి గాఢాంధకారాన్ని పారదోల గల కొవ్వొత్తి ఇద్దరు మనుషులకు వంట చెయ్య లేదా? నా భోజనం అయింది గనక నాకేమీ తొందర లేదు. మీరు కూడా ఓపిక పట్టితే విందుభోజనం పెడతాను," అన్నాడు అలీ.

ఈ మాటలకు సిగ్గుపడి అలీ మిత్రులు వచ్చిన దారినే వెళ్ళిపోయారు. అతను అమాయకుడు కాడని వారికి తెలిసి వచ్చింది.






# లౌక్యంలేని విద్యలు

ఒక ఊళ్ళో నలుగురు యువకులు ఉండే వారు. వారు ఆ బాల్యమిత్రులు. వారిలో ముగ్గురికి ఒక పండితుడి ద్వారా వేరు వేరు విద్యలు సిద్ధించాయి.

నాలుగోవాడికి మటుకు ఎలాటి శాస్త్ర విద్యలూ అలవడలేదు. కాని అతనికి లౌకిక జ్ఞానం ఉన్నది.

కొంతకాలం గడిచాక విద్యలు నేర్చిన ముగ్గురూ దేశాటనకు బయలుదేరారు. రాజులను సందర్శించి, వారి వద్ద తమ విద్యలు ప్రదర్శించి ధనం సంపాదించాలని వారి ఉద్దేశం.

వాళ్ళ వెంట నాలుగోవాడు కూడా బయలుదేరాడు.

ఏ విద్యలూ రాని ఆ నాలుగోవాడు తమ వెంట రావటం మిగిలిన ముగ్గురికీ ఇష్టంలేదు.

వాళ్ళు వాడితో, "ఒరే బాబూ, నువు మా వెంట వచ్చి ఏమిలాభం పొందుతావు? మేం మా విద్యలతో సులువుగా రాజాశ్రయం సంపాదించగలం. నిన్ను ఏ రాజు చేరనిస్తాడు? నీకు లోకజ్ఞానం ఉన్నదే అనుకో. రాజసభలలో నీ పాటి లోకజ్ఞానం లేనివాడెవడు? అందుచేత నువు వెనక్కు తిరిగిపో!" అన్నారు.

నాలుగోవాడు వాళ్ళను బతిమాలుతూ, "నన్ను కూడా మీ వెంట రానివ్వండి. మనమందరమూ చిన్నతనం నుంచీ స్నేహితులం గదా? నాకు రాజాశ్రయం దొరకకపోతేనేం? మీకు గొప్పగా సన్మానాలు జరుగుతూ ఉంటే నేను చూసి సంతోషిస్తాను." అన్నాడు.

వాడు తమను ఎలాగూ వదలడని రూఢి అయినాక విద్వాంసులు ముగ్గురూ నాలుగోవాణ్ణి తమ వెంట రానిచ్చారు.

వాళ్ళు కొంత దూరం ప్రయాణించాక అడవి వచ్చింది. అక్కడ వాళ్ళకు అనేక

బి. చలపతిరావు

ఎముకలు ఎదురుగా పడి ఉండి కనిపిం చాయి. వెంటనే విద్యావంతులలో ఒకడు, "ఈ ఎముకలన్నీ ఒక సింహానివి. నేను వాటినన్నిటినీ ఏర్చి, పూర్తి అస్థిపంజరాన్ని కూర్చగలను," అంటూ సింహం అస్థిపంజ రాన్ని నిర్మించాడు.

రెండోవాడు, "నా మంత్రశక్తి చేత ఈ అస్థిపంజరానికి చర్మమూ, కండరాలూ, రక్తప్రసారమూ కలిగించగలను," అంటూ తన విద్యను ప్రయోగించి సింహం తాలూకు అస్థిపంజరాన్ని సింహం కళేబరంగా తయారు చేశాడు.

అప్పుడు మూడోవాడు ముందుకు వచ్చి, "మీ ఇద్దరి కన్న కూడా పెద్ద విద్య నేను ప్రదర్శిస్తాను. నేను ఈ క్షణంలోనే ఈ సింహం కళేబరానికి ప్రాణం పోయ గలను!" అన్నాడు.

ఈ మాట విని నాలుగోవాడు అదిరిపడి, మూడోవాణ్ణి బతిమాలుకుంటూ, "ఆ పని మాత్రం చెయ్యకు. సింహం క్రూరమైన జంతువని మన కందరికీ తెలుసుగదా! దానికి ప్రాణం పొయ్యటం అంటే మనం కోరి ప్రమాదం తెచ్చుకోవటం అవుతుంది!" అన్నాడు.

లోకజ్ఞానం ఏ మాత్రమూ లేని మూడో వాడు ఈ మాటలకు చీదరించుకుని, "నాకు చేతనైన విద్యను సమయం వచ్చినప్పుడు ప్రదర్శించటానికి ఏవో కుంటిసాకులు అడ్డు పెడతావేమిటి? సింహం కళేబరానికి ప్రాణం పోసే అవకాశం మళ్ళీ వస్తుందా? నేను కష్టపడి సాధించిన ఈ విద్య ఎందుకు పనికి వచ్చేటట్టు?" అన్నాడు.

"సరే, నీ యిష్టం వచ్చినట్టు చేసుకో. నన్ను మాత్రం ముందు చెట్టు ఎక్కనీ!" అంటూ నాలుగోవాడు గబగబా పరిగెత్తు కుంటూ పోయి దగ్గిరలో ఉన్న చెట్టు ఎక్కి కూర్చున్నాడు.

వెంటనే మూడోవాడు తన మంత్రశక్తి ప్రయోగించి సింహం కళేబరానికి ప్రాణం పోశాడు. వెంటనే ఆ సింహం గర్జిస్తూ లేచి, ముగ్గురు మిత్రుల పైనా పడి, వాళ్ళను చంపేసింది.



# దురాశా ఫలితం

ఒక ఊళ్ళో రామాలయానికి ఒక పేద పూజారి ఉండేవాడు. అతనికి డబ్బు సంపాదించాలని ఆశపుట్టింది. ప్రజల నుంచి బాగా డబ్బు గుంజటానికి అతను ఒక ఆలోచన చేశాడు. ఈ ఆలోచన రాగానే అతను దేవాలయానికి వెళ్ళటం మానేసి, ఇంట్లోనే ఉండిపోయాడు.

ఈ సంగతి తెలిసి ఊరి పెద్దలు పూజారి వద్దకు వచ్చి, అతను గుడి తెరవక పోవటానికి కారణం అడిగారు.

పూజారి దీనంగా వారితో, "ఏం చెప్పమన్నారు? నిన్న రాత్రి కలలో నాకు రాముల వారు కనిపించి, 'భక్తా, నువు పరమ దరిద్రుడివి. అందుచేత, నేను ఈ ఆలయంలో ఉండ దలచలేదు. వెళ్ళిపోతాను,' అన్నారు. నేను ఆయనతో, 'స్వామీ, మీరు నా కారణంగా వెళ్ళవద్దు. నా దారిద్ర్యాన్ని గ్రామపెద్దలు తీర్చకపోరు,' అన్నాను," అని చెప్పాడు.

గ్రామ పెద్దలు తమలో తాము ఆలోచించుకుని, "ఈ పూజారిని ఉంచితే స్వామి వారికి ఆగ్రహం వస్తుంది," అనుకుని, అతన్ని తొలగించి, అతని స్థానంలో డబ్బున్న పూజారిని ఏర్పాటు చేశారు.

పూజారి ఎత్తు బెడిసికొట్టింది.

—టి. ఎస్. నారాయణమూర్తి





# ఖలీఫా కల

బొగ్దాదనగరాన్ని ఖలీఫా హరూన్ అల్ రషీద్ పరిపాలించేవాడు. ఆయన ఒక ఏడు మక్కాయాత్ర చేసి వచ్చాడు. ఆ రాత్రే ఆయనకు ఒక వింత కల వచ్చింది. ఆ కలలో ఖలీఫాకు ఇద్దరు దేవదూతలు కనిపించారు.

"ఈ యేడు హజ్ యాత్రికులు ఎంత మంది మక్కాకు వచ్చారు?" అని ఒక దేవదూత రెండోవాణ్ణి అడిగాడు.

"పది లక్షలమంది," అని రెండవ దూత సమాధానమిచ్చాడు.

"వారిలో ఎంతమంది యాత్ర ఫలించింది?" అని మొదటి దూత అడిగాడు.

"ఎవరి యాత్రా ఫలించలేదు. ఒక్కడి యాత్ర మాత్రమే భగవంతుడికి సమ్మత మయింది." అన్నాడు రెండో దూత.

"పది లక్షలమంది పుణ్యాన్ని సంపాదించుకున్న ఆ పుణ్యాత్ము డెవరు? ఎక్కడ ఉంటాడు?" అని మొదటి దూత అడిగాడు.

"అతని పేరు ఇస్మాయిల్. బస్రా నగరంలోని హరూన్ మియా వీధిలో ఉంటున్నాడు," అని రెండో దూత చెప్పాడు.

వెంటనే ఖలీఫాకు మెలకువ వచ్చింది. ఆయన లేచి కూర్చుని తనకు వచ్చిన కల గురించి బాగా ఆలోచించాడు. దేవదూత చెప్పిన ఆ పుణ్యాత్ముడి దర్శనం చేసుకోవాలని ఆయనకు అనిపించింది.

మర్నాడు ఖలీఫా సామాన్యుడి వేషం వేసుకుని బస్రానగరానికి వెళ్ళాడు. ఆ నగరంలో హరూన్ మియా వీధి సులువుగానే దొరికింది. ఆ వీధి చేరి ఖలీఫా, దారే పోయే ఒక మనిషిని ఆపి, "ఈ వీధిలో ఇస్మాయిల్ గారి ఇల్లు ఎక్కడ?" అని అడిగాడు.

ఆ మనిషి "ఇస్మాయిల్ ఇల్లు వీధి ఈ చివరన ఉన్నది," అన్నాడు.

వీధి చివరకు నడిచేసరికి ఖలీఫాకు అక్కడ ఒక చిన్న కుటీరం కనిపించింది.

కె. అన్వర్ బాషా



దాని ముందు అరుగు మీద ఒక నడి వయసు వాడు చెప్పులు కుట్టుతూ కనిపించాడు.

"ఇస్మాయిల్‌గారి ఇల్లు ఏది?" అని ఖలీఫా ఆ మనిషిని అడిగాడు.

"నేనే ఇస్మాయిల్‌ను. ఎవరు మీరు? పాదరక్షలేమైనా కుట్టాలా?" అని ఆ మనిషి ఖలీఫాను అడిగాడు.

ఆ మాట వినగానే ఖలీఫా నిర్ఘాంత పోయాడు. అంత పేదవాడు మక్కాయాత్ర చేసి ఉంటాడని ఆయనకు తోచలేదు.

"నేను పాదరక్షలు కుట్టించుకోవటానికి రాలేదు. ఈ యేడు తమరు మక్కాయాత్ర చేశారా? చేసి ఉంటే, ఎలా చేశారో నాకు కాస్త వివరంగా చెప్పండి," అని ఖలీఫా అడిగాడు.

ఇస్మాయిల్ నిట్టూర్చి ఇలా అన్నాడు:

"అయ్యా, నేను మక్కాయాత్ర ఉద్దేశించినది మొదలు రోజుకు ఒక కాసు చొప్పున కూడబెడుతూ వచ్చాను. ఈ యేడు యాత్రకు సరిపడా డబ్బు చేరింది. ఎన్నో యేళ్లుగా ఎదురు చూసిన అవకాశం ఈ యేడు వచ్చిందిగదా అని ఎంతో సంతోషించాను. కాని దైవనిర్ణయం మరోలా ఉన్నది. నేను యాత్రకు బయలుదేరే ముందు ఒకనాడు గర్భవతిగా ఉన్న నా భార్య, 'మన పక్క ఇంట్లో మాంసం వండుతున్నట్టున్నారు. వాసన వస్తున్నది. మనం మాంసం తిని చాలా రోజులయింది. వాళ్ళను అడిగి మాంసం కూర కాస్త తీసుకురండి,' అన్నది.

"మన పొరుగున ఉన్న రజాక్ మన లాగే బీదవాడు. ఎక్కడో శ్రమపడి కొద్ది మాంసం తెచ్చి ఉంటాడు. అందులో కొంత మనం అడగటం భావ్యం కాదు," అన్నాను. ఎంత కొంచమైనా ఇప్పించుకు రమ్మని ఆమె నన్ను బతిమాలింది.

"ఆమె కోరిక తీరుద్దామని ఒక చిన్న గిన్నె పట్టుకుని వెళ్ళి తలుపు తట్టాను. రజాక్ నీరసంగా బయటికి వచ్చాడు.

"అయ్యా, రజాక్‌గారూ, గర్భవతి అయిన నా భార్య మీ ఇంట్లో మాంసం వండుతున్న సంగతి ఎలాగో పసికట్టింది.

దాని కోరిక తోసి పుచ్చలేక మీ యింటికి వచ్చాను. నా మీద దయవుంచి కనీసం ఒక్క ముక్క అయినా లేదనకుండా ఇవ్వండి," అని అడిగాను.

దానికి రజాక్ కంట తడి పెట్టుకుంటూ, "ఇస్మాయిల్‌గారూ, ఈ మాంసం మీరు తినదగినది కాదు," అన్నాడు.

"ఎలాటిదైనా ఫరవాలేదు. కొంచెం ఇవ్వండి," అని బతిమాలుకున్నాను.

"రజాక్ అమిత విచారంగా, 'చూడు, భాయీ! అయిదు రోజులుగా నేనూ, నా భార్యా, పిల్లలూ, అందరమూ పస్తు లున్నాము. గౌరవం పోతుందని నేను అడుక్కు తినటానికి వెనకాడాను. ఈ రోజు పిల్లలంతా ఆకలికి అలమటించి పోతూ ఉంటే చూడలేక ఇల్లు వదిలి వెళ్ళాను. ఒక చోట చచ్చి పడి ఉన్న గాడిద ఒకటి కనిపించింది. దాని తొడ నుంచి కొంత మాంసం కోసి తెచ్చాను. దానినే నా భార్య వండుతూ ఉంది. ప్రాణాపాయ స్థితిలో ఉచితానుచితాలు పాటించకుండా దేనినైనా సరే తిని ప్రాణాలు కాపాడుకోవాలని మన మతగ్రంథం చెబుతూంది గదా!' అన్నాడు.

"రజాక్ మాటలు విని నాకు దుఃఖం పొంగు కొచ్చింది. ఇంతకాలమూ నా కంటె పేదవాడు లేడని అనుకుంటూ ఉండేవాణ్ణి. రజాక్ పరిస్థితి తెలిసి నేను పడిన బాధ ఇంతా అంతా కాదు. నేను వెంటనే ఇంటికి తిరిగి వెళ్ళి, మక్కాయాత్ర కోసం దాచి ఉంచిన ధనమంతా తెచ్చి రజాక్ చేతిలో పెట్టి, ఏదైనా వ్యాపారం చేసి జీవించమని చెప్పాను. ఇందుచేత ఈ యేడు మక్కా యాత్ర చేయలేక పోయాను."

అతని కథ అంతా విన్న ఖలీఫా, "పుణ్యాత్ముడా, చింతించకు. ఈ యేడు మక్కాయాత్ర చేసిన పది లక్షలమంది పుణ్యమూ నీ ఒక్కడికే దక్కింది. ఈ సంగతి నా కలలో కనిపించి దేవదూతలు చెప్పారు. నేను బాగ్దాదులో పాలించే ఖలీఫాను. నా పేరు హరూనల్ రషీద్," అన్నాడు. ఈ మాటలు విని ఇస్మాయిల్ నిశ్చేష్టుడై పోయాడు.



# పాపానికి మూలం

ఒక పండితుడికి ఒక అనుమానం వచ్చింది—పాపాలకు ఏది మూలం? ఎంతమందిని అడిగినా ఈ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. అందుచేత ఆ పండితుడు కాశీకి ప్రయాణమై, అక్కడి విద్వాంసులను అడిగి తెలుసుకుందా మనుకున్నారు.

దారిలో ఒక గ్రామం తగిలింది. ఊరి బయట దేవాలయం సమీపంలో ఒక గుడిసె కనిపించింది. ఆ గుడిసె వాణ్ణి పండితుడు పలకరించి, తాను కాశీ ఎందుకు వెళుతున్నదీ చెప్పి, "ఇక్కడ నేను స్వయంపాకం చేసుకునేటందుకు తగిన చోటు ఏమైనా ఉన్నదా?" అని అడిగాడు.

"మీరు ఈ గుడి ఆవరణలోనే స్వయంపాకం చేసుకోవాలి. మీరు కాస్సేపు మంటపంలో కూర్చోండి. నేను ఇప్పుడే వచ్చి తమకు సహాయం చేస్తాను," అన్నాడు.

తరవాత కొద్ది సేపటికి ఆ గుడిసె వాడు ఒక పళ్ళెంలో భోజనం తెచ్చి, "స్వామి ఇది నా ఇంటి భోజనం. ఇది ఆరగించి నా వ్రతం పూర్తి చెయ్యండి. ఈ వ్రతం పూర్తి చెయ్యగలందులకు ఎన్నో ఏళ్ళుగా నూట ఎనిమిది బంగారు కాసులు పోగుచేశాను," అన్నాడు.

"నీ భోజనం తింటే నాకు పాపం చుట్టుకుంటుంది," అన్నాడు పండితుడు.

"నా బంగారు కాసులన్నీ తమకు దానం చేస్తాను," అన్నాడు గుడిసెవాడు.

బ్రాహ్మణుడు భోజనం చేశాడు.

"స్వామీ, పాపానికి మూలం తెలిసింది గదా? ఆశ! ఇక మీరు కాశీ వెళ్ళక్కర్లేదు. ఇంటికి తిరిగి పొండి," అన్నాడు గుడిసెవాడు.





# ఎవరు పాపి?

ఒక ఊళ్ళో ధనగుప్తుడు అనే వైశ్యోత్తముడు ఉండేవాడు. ఆయన అనేక పాపాలకు ఒడిగట్టి రెండు చేతులా ధనం సంపాదించి, కోటీశ్వరుడైనాడు.

ఆయనను ఆదర్శంగా పెట్టుకుని, ఆయన సహాయం పొంది అనేక మంది ఇతర వర్తకులు లక్షాధిపతులయారు.

ధనగుప్తుడికి ముసలితనం పైన పడింది. చావు దగ్గిరికి వస్తున్న కొద్దీ ఆయనకు పాప భీతి పట్టుకున్నది. బతికినన్నాళ్ళూ తాను పాపాలే చేశాడు; ఇకనైనా కొంత పుణ్యం మూట కట్టుకోకపోతే, చచ్చినాక ఏ నరక కూపాలలో యాతన పడవలిసివస్తుందో నని ఆయనకు భయం పట్టుకున్నది. పుణ్యం సంపాదించటానికి గాను ఆయన తీర్థ యాత్రలు చేయ సంకల్పించాడు.

ధనగుప్తుడు తీర్థయాత్రలు చేయబోతు న్నాడని వినగానే మరి ముగ్గురు వర్తక శ్రేష్ఠులు తాము కూడా ప్రయాణమయారు. వారు కూడా జన్మలో ఏనాడూ పుణ్యం చేసు కుని ఎరగరు. ఏదో పరమార్థం లేనిదే ధన గుప్తుడు ఏ పనీ చేయడని వారికి తెలుసు. పుణ్యం మాట అటుంచి, ఈ తీర్థయాత్రల వల్ల ఇతర లాభాలు ఏవైనా ఉండవచ్చు. ఆ లాభాలు తాము మాత్రం ఎందుకు పొందగూడదు? అదీగాక, ఒకరికి నలుగు రైతే ఖర్చు కలిసివస్తుంది. దారిలో ఎవరి కైనా కాస్త జబ్బు చేసినా మిగిలినవాళ్ళు ఆదుకుంటారు. ఇవన్నీ ఆలోచించి, ధన గుప్తుడు వాళ్ళను వెంట రానివ్వటానికి ఒప్పుకున్నాడు.

కాశీ వెళ్ళటమా, రామేశ్వరం వెళ్లటమా అని వారిలో వారికి చర్చ జరిగింది. కాశీకి పోవటమూ కాటికి పోవటమూ ఒకటే నని సామెత ఉన్నది. రామేశ్వరమైతే దగ్గిర, దారి సులువు. అదీగాక, ఆ గ్రామంలోనే

శింగంపల్లి అప్పారావు

రాముడు అని ఒక అంటరానివాడు ఉన్నాడు. వాడు ఇంట్లో అలిగి, మూడు సార్లు రామేశ్వరం పారిపోయి తిరిగివచ్చాడు. వాడికి రామేశ్వరం ప్రయాణం కొట్టిన పిండి. వాణ్ణి వెంట పెట్టుకుని నలుగురు వర్తకులూ రామేశ్వరం పోవటానికి నిశ్చయించారు.

మంచి రోజు చూసుకుని, రాముడు ముందు దారితీయగా, రామనామస్మరణ చేస్తూ నలుగురు వర్తకులూ రామేశ్వరం బయలుదేరారు. ప్రయాణం అన్ని విధాలా అనుకూలంగానే సాగింది. ఇంకా ఒకటి, రెండు రోజుల ప్రయాణం మిగిలి ఉన్న దనగా ఆకాశాన కారుమేఘాలు కమ్ముకున్నాయి. ప్రళయంగా గాలి వీచసాగింది.

ఆ సమయాన యాత్రికులు ఒక అడవి గుండా నడుస్తున్నారు. గాలికి ఎంతెంత మానులూ భయంకరంగా ఊగుతూ, విరిగి మీద పడేటట్టు కనబడ్డాయి. పైన మేఘాలు ఏనుగుల మందలలాగా తిరుగుతూ, భీకరంగా గర్జిస్తున్నాయి. కళ్ళు చెదిరే మెరుపులతో యాత్రికుల కళ్ళు గుడ్డి అయిపోతున్నాయి.

వాళ్ళు పిక్కబలం కొద్దీ పరిగెత్తి, ఎలా గైతేనేం, ఒక పాడుబడిన దేవళంలో తల దాచుకున్నారు.

వెంటనే పిడుగుల వర్షం ప్రారంభ మయింది. ఒకటి తరవాత ఒకటిగా పిడుగులు అన్ని వైపులా భయంకరమైన శబ్దంతో పడుతున్నాయి. ఒక పిడుగు దేవళానికి అంత దూరంలో ఉన్న చెట్టు పైన పడింది.



చెట్టు సగం భాగం సురసురా కాలిపోయింది. మిగిలిన చెట్టు విరిగి పడిపోయింది.

మరి కొద్ది క్షణాలకు ఇంకొక పిడుగు దేవళానికి యాభై అంగల దూరాన పడింది! యాత్రికులకు ప్రాణాలలో ప్రాణాలు లేవు.

"ఇదేం పిడుగుల వర్షం! నా జన్మలో ఎన్నడూ ఇలాటిది ఎరగను. మనలో ఎవడో పాపాత్ముడు ఉన్నాడు. ఆ పాపాత్ముడి మూలంగా మనం అందమూ నాశనం కాబోతున్నాం. ఇది తప్పేటట్టు లేదు," అన్నాడు ధనగుప్తుడు.

మిగిలిన ముగ్గురు వర్తకులూ ఒకరి ముఖం ఒకరు చూసుకుని, "ఈ రాముడే పాపాత్ముడు. ఈ అంటరానివాణ్ణి మనం వెంట తీసుకురావటమే తప్పు. తెచ్చామే అనుకో, వీడు కూడా మనతో సమంగా ఈ పవిత్రమైన దేవళంలో తగుదునమ్మా అని వచ్చి కూర్చున్నాడు! దేవుడు చూడడూ? ఆగ్రహించడూ?" అన్నారు.

వాళ్ళు నలుగురూ ఏకగ్రీవంగా రాముణ్ణి అవతలికి వెళ్ళమన్నారు.

"బాబూ, పెద్దవాన అయింది. తడిసి పోతాను. కరుణించండి. పుణ్యం కట్టుకోండి. నేను పాపినే. కాని మీ వంటి పుణ్యాత్ముల పక్కన ఉంటే నన్ను దేవుడు క్షమిస్తాడు. నా ఒక్కడి మూలంగా మీరు నలుగురు నష్టపడతారా? దేవుడు అంత అన్యాయం చెయ్యడు!" అని రాముడు వర్తకులను బతిమాలాడు.

వాడు చలికి వణుకుతూ, దణ్ణాలు పెట్టి ప్రాధేయపడుతున్న కొద్దీ యాత్రికుల గీర్వాణం మరింత ఎక్కువ అయింది. వాళ్ళు రాముణ్ణి వానలోకి నెట్టేశారు.

రాముడు పరిగెత్తిపోయి, దూరాన ఉన్న ఒక చెట్టు కింద నిలబడ్డాడు. మరుక్షణమే ఆకాశం పగిలినట్టు భయంకరమైన చప్పుడయింది. కళ్ళు చెదిరేటట్టు మెరుపు మెరిసింది. రాముడు కళ్ళు గట్టిగా మూసుకుని మళ్ళీ తెరిచేసరికి ఎదురుగా దేవళం లేదు, రాళ్ళగుట్ట మాత్రమే ఉన్నది.

ధనగుప్తుడూ అతని అనుచరులూ పిడుగు వాతపడి, దేవళంతోపాటే నశించిపోయారు.





# అర్ధణా రాజా

పాటలీపుత్ర నగరంలో ఒక పేదవాడు ఉండేవాడు. వాడు నీళ్ళు మోసి జీవితం వెళ్ళ బుచ్చుతూండేవాడు. వాడి నివాసం నగరపు ఉత్తరద్వారం వద్ద.

ఆ నగరంలోనే దక్షిణ ద్వారానికి సమీపంలో ఒక స్త్రీ ఉండేది. ఆమె కూడా నీళ్ళ బిందెలు మోసి జీవయాత్ర గడుపుతూ ఉండేది. వీరిద్దరికీ స్నేహం కుదిరింది, పెళ్ళి కూడా అయింది.

పెళ్ళి చేసుకున్నప్పటికీ, ఇద్దరూ నగరం చెరొక మూలా పనిచేసుకుంటూ ఉండటం వల్ల తరుచుగా ఒకరి నొకరు కలుసుకునేవారు కారు. ఒక రోజు ఏదో పండగ వచ్చింది. నీళ్ళు మోసేవాడు ఆ నాడు తన పని త్వరగా ముగించుకుని, దక్షిణద్వారం దగ్గరఉండే తన భార్యను చూడబోయాడు.

"ఇవాళ పండగరోజు. అందరూ పండగ చేసుకుంటున్నారు. మనం మాత్రం చేసుకోవద్దా? నా దగ్గిర అర్ధణా ఉన్నది. నీ దగ్గిర ఏ మాత్రం ఉన్నది?" అని భార్య తన భర్తను అడిగింది.

"నా దగ్గిర కూడా అర్ధణా ఉంది. దాన్ని ఉత్తరద్వారం సమీపంలో ఉన్న గోడలో ఇటుకల సందున దాచి పెట్టాను. కాని అణాతో మనం పండగ ఎలా చేసుకుంటాం?" అన్నాడు భర్త.

"ఒక కానీ పెట్టి పూలు కొందాం. ఇంకో కానీకి చందనం కొందాం. మిగిలిన అర్ధణాతో పాయసం కామకు తాగుదాం!" అన్నది భార్య.

ఈ మాటకు నీళ్ళు మోసేవాడు పరవశుడై పోయాడు. తానూ, తన భార్యా కలిసి పండగ చేసుకోబోతున్నామన్న ఆనందంలో వాడికి ఒళ్ళు తెలియలేదు.

"నువు ఇక్కడే ఉండు. నే నిప్పుడే ఉత్తరద్వారానికి వెళ్ళి, నేను దాచుకున్న

అర్ధణా కూడా తెస్తాను!'' అని వాడు తన భార్యకు చెప్పి, దక్షిణద్వారం నుంచి ఉత్తరద్వారానికి బయలుదేరాడు.

మిట్టమధ్యాన్నం కావస్తున్నది. నెత్తిన ఎండ మండి పోతున్నది. కాని ఆనందంలో ఆ నీళ్ళు మోసేవాడికి ఎండా తెలియలేదు, వేడీ తెలియలేదు. వాడు ఉత్సాహంతో గెంతుతూ పోతున్నాడు.

రెండు ద్వారాలకూ మధ్య మార్గంలో రాజుగారి మేడ ఉన్నది. ఆ మేడ మీది నుంచి రాజుగారు వీధిలోకి చూస్తూ నిలబడి ఉన్నాడు. ఎండను లక్ష్య పెట్టకుండా, కాళ్ళు కాలుతున్న సంగతి కూడా తెలియకుండా, మహాఉత్సాహంలో పోతున్న నీళ్ళు మోసేవాడు ఆయనకు కనిపించాడు.

వాణ్ణి చూసి రాజు ఆశ్చర్యపోయాడు. వాడి ఆనందానికి కారణమేమిటో తెలుసుకోవాలనిపించింది. ఆయన సేవకులను పిలిచి, ''ఆ పాడుతూ వెళ్ళేవాణ్ణి నా దగ్గిరికి పట్టుకు రండి,'' అని ఆజ్ఞాపించాడు.

భటులు వీధిలోకి వెళ్ళి నీళ్ళు మోసేవాడితో, ''ఏయ్, నిన్ను రాజుగారు రమ్మంటున్నారు,'' అన్నారు.

''నాకు రాజుగారితో ఏం పని? నేను ఆయనను ఎరగను,'' అంటూ నీళ్ళు మోసేవాడు తన దారిన తాను పోబోయాడు.

రాజభటులు వాణ్ణి పట్టుకుని, బలవంతాన రాజుగారి దగ్గిరికి ఈడ్చుకుపోయారు.

రాజుగారు వాణ్ణి చూసి, ''ఏమోయ్, పైన నెత్తి, కింద కాళ్ళూ మాడుతున్నా



లెక్క చెయ్యకుండా ఇంత ఎండలోపడి ఎక్కడికి పోతున్నావు?'' అని అడిగాడు.

''అయ్యా, నా గుండెల్లో ఇంత కన్న వేడి అయిన కోరిక ఉన్న కారణం చేత, నాకు ఈ బయటి ఎండ వేడి ఎంత మాత్రమూ తెలియటం లేదు.'' అన్నాడు నీళ్ళు మోసేవాడు.

అదెంత గొప్ప కోరికో గదా అనుకుని రాజుగారు, ''ఏమిటా కోరిక?'' అని నీళ్ళు మోసేవాణ్ణి అడిగాడు.

''అయ్యా, ఇవాళ పండగ రోజు. నా భార్య దగ్గిర అర్ధణా ఉన్నది. నేను ఉత్తరద్వారం వద్ద గోడలో ఇటుకల సందున మరొక అర్ధణా దాచి ఉంచాను. ఇద్దరి డబ్బులూ కలిపి అణా అవుతుంది. అందులో కానీకి పూలూ, కానీకి చందనమూ కొని, మిగిలిన అర్ధణాతో పాయసం వండుకుని, ఇద్దరమూ హాయిగా పండగ చేసుకుంటాం. అందుకే బయలుదేరాను. నేను ఉత్తర ద్వారానికి వెళ్ళి, నా అర్ధణా తీసుకుని తిరిగి దక్షిణద్వారానికి వెళ్ళాలి. అప్పుడు పండగ చేసుకోవాలి. నా భార్య నా కోసం కాచుకుని ఉన్నది. అందుచేత నన్ను త్వరగా వెళ్ళనివ్వండి.'' అన్నాడు నీళ్ళు మోసేవాడు.

ఈ మాట విని రాజు నివ్వెరపోయాడు.

''నడిచినంత దూరం ఇంకా నడిస్తే గాని ఉత్తరద్వారం చేరవు. దానికి రెట్టింపు దూరం నడిస్తే గాని దక్షిణద్వారం చేరుకోవు. ఎందుకింత శ్రమ? నేను నీకు అర్ధణా



ఇస్తాను. నువు నీ భార్య వద్దకు తిరిగి వెళ్లు. ఇద్దరూ పండగ చేసుకొండి." అన్నాడు రాజు.

"చిత్తం! తమరు అర్ధణా ఇవ్వండి. కాని నా అర్ధణా కూడా తెచ్చుకుంటాను." అన్నాడు నీళ్ళు మోసేవాడు.

"ఆ అర్ధణా కోసం ఎందుకు మథనపడ తావు? పావలా ఇస్తాను. తీసుకుని దక్షిణ ద్వారానికి తిరిగివెళ్ళు." అన్నాడు రాజు.

"చిత్తం! పావలా ఇప్పించండి. నా అర్ధణా కూడా తీసుకుని తిరిగి పోతాను," అన్నాడు నీళ్ళు మోసేవాడు.

రాజుకు పట్టుదల వచ్చింది. ఎంత ఇస్తే వాడు ఆ అర్ధణా మాట మరిచిపోతాడో చూతామని, ఆయన వాడికి ఒక రూపాయ నుంచి లక్ష రూపాయల దాకా ఇస్తానంటూ బేరం పెంచాడు.

రాజు ఎంత ఇస్తానన్నప్పటికీ నీళ్ళు మోసేవాడు తన అర్ధణా తనను తీసుకో నివ్వమని రాజును బతిమాలాడు.

చివరకు రాజు విసిగి, "నువు ఆ అర్ధణా తీసుకోకుండా ఉండేటట్టయితే, సగం నగ రానికి ఇప్పుడే నిన్ను రాజును చేస్తాను. ఏమంటావు?" అన్నాడు.

"చిత్తం! అలాగే చెయ్యండి!" అన్నాడు నీళ్ళు మోసేవాడు గత్యంతరం లేనట్టు.

వెంటనే రాజు మంత్రిని పిలిపించి, "వీణ్ణి సగం నగరానికి రాజును చేస్తూ పత్రం తయారు చెయ్యండి." అన్నాడు.

నగరాన్ని మంత్రి ఉత్తర, దక్షిణ భాగా లుగా విభజించాడు. రాజు నీళ్ళు మోసే వాడితో, "నగరంలో నీకు ఏ సగం కావాలో కోరుకో. ఆ సగానికి నిన్ను రాజుగా చేస్తూ మంత్రిగారు పత్రం రాసేస్తారు," అన్నాడు.

"చిత్తం! నాకు ఉత్తరపు సగం ఇప్పించండి," అన్నాడు నీళ్ళు మోసేవాడు. ఉత్తర ద్వారం దగ్గిర తాను దాచుకున్న అర్ధణా కోసమే వాడు అలా కోరుకున్నాడని అందరూ అనుకున్నారు.

రాజు అన్న మాట ప్రకారం నీళ్ళు మోసేవాణ్ణి ఉత్తర నగరానికి రాజు చేశాడు. అయితే ప్రజలు ఈ రాజును "అర్ధణా రాజు" అని మాత్రమే పిలిచేవాళ్ళు.





# వంశ గౌరవం

బుందేల్‌ఖండ్‌లో ఒక ఠాకుర్ వంశస్థుడు ఉండేవాడు. ఆయనను అందరూ "దీవాన్ సాహెబ్" అని పిలిచేవారు. ఆయనకు తిండికి కూడా సరిగా గడవక పోయినా రాజసం చాలా ఉండేది. అతడు ఎలాటి ఉద్యోగమూ, పనీ చేసేవాడు కాదు; తన వంశంయొక్క గొప్పతనం గురించి డాబులు కొడుతూ, అందరికాలమూ పాడుచేసేవాడు.

ఒకనాడు దీవాన్ సాహెబ్ వీధిలో నిలబడి ఒక షావుకారుతో మాట్లాడుతూ ఉండగా, దూరాన ఒక బండి కనిపించింది. ఆ బండి మీద ధాన్యం బస్తాలు ఎత్తుగా వేసి ఉన్నాయి.

ఆ బండిని చూసి దీవాన్ సాహెబ్, "ఆహా! ఎంత పెద్ద ఏనుగు! మా తాతగారి దగ్గిర ఇలాటి ఏనుగే ఉండేది," అన్నాడు.

"తమరు పరాకు చిత్తగిస్తున్నారు, దీవాన్ సాహెబ్. ఆ వచ్చేది ఏనుగు కాదు, ధాన్యపు బస్తాల బండి," అన్నాడు షావుకారు.

"మీకు చత్వారం వచ్చేసి నట్టుంది, షావుకారుగారూ! ఏనుగు యిటుకేసి రావటం స్పష్టంగా కనిపిస్తూంటేనే?" అన్నాడు దీవాన్ సాహెబ్.

"క్షమించాలి. అది ఏనుగు కానేకాదు, ధాన్యపు బస్తాల బండీయే!" అన్నాడు షావుకారు. దీవాన్ సాహెబ్‌కు ఈ మాట వినగానే పంతం వచ్చేసింది.

"అది ఏనుగైతే నేను మీ తల నరికేస్తాను. బండీ అయితే నా తల మీరు నరకండి! ఇదే మనిద్దరి మధ్యా పందెం!" అని మీసాలు మెలివేస్తూ ఠీవిగా నిలబడ్డాడు దీవాన్ సాహెబ్. కొద్ది సేపట్లోనే బండి వారికి సమీపంగా వచ్చింది.

"చూశారా, దీవాన్ సాహెబ్? మీరు ఓడిపోయారు!" అన్నాడు షావుకారు.

"అవును. మీరు నా తల నరికివెయ్యండి!" అన్నాడు దీవాన్ సాహెబ్.

బుందేల్‌ఖండ్ జానపద కథ



"దేనికిలే పోనివ్వండి!" అన్నాడు షావుకారు, ఇకనైనా ఈ ఠాకుర్ వంశస్థుడు ప్రగల్భాలు మానేస్తాడన్న ఆశతో.

"అలా వీల్లేదు. పందెం ప్రకారం మీరు నా తల నరకవలిసిందే! మా ఠాకుర్ వంశస్థులు ఆడితప్పరు!" అని దీవాన్ సాహెబ్ మూర్ఖించాడు.

షావుకారుకు ప్రాణం మీదికి వచ్చింది.

"అలా అయితే, మనం ఈ విషయం న్యాయాధికారిని సంప్రదించి. సలహా పొందటం మంచి దనుకుంటాను," అన్నాడు షావుకారు. దీవాన్ సాహెబ్ సరేనన్నాడు.

ఇద్దరూ కలిసి న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళారు. న్యాయాధికారి విషయమంతా విని, షావుకారుకు సంప్రాప్తించిన దుస్థితి గ్రహించి, ఈ విధంగా తన తీర్పు చెప్పాడు:

"దీవాన్ సాహెబ్‌గారి తల షావుకారు సొత్తు అయిన మాట నిజమే. కాని అయన దాన్ని తన యిష్టం వచ్చినప్పుడు నరుక్కోవచ్చు. అయనను తొందర చేయటానికి ఎవరికీ అధికారం లేదు!"

ఈ తీర్పు విని షావుకారు సంతోషించాడు, కాని దీవాన్ సాహెబ్ ఒక పేచీ పెట్టాడు: "అలా అయితే, ఈ క్షణం నుంచీ నా తలను రక్షించే భారమూ, పోషించే భారమూ షావుకారుదే. దాని విషయమై ఇక నా పూచీ ఎంత మాత్రమూ లేదు!"

షావుకారు గత్యంతరం లేనివాడై, దీవాన్ సాహెబ్ తలను రక్షించి, పోషించే భారం తన మీద వేసుకున్నాడు.

అయితే ఈ భారం కొద్దిపాటిది కాదు. తన వంశమర్యాదకు తగిన విధంగా దీవాన్ సాహెబ్ షావుకారు చేత పోషణ చేయించుకుంటూ, షావుకారు ఇల్లు గుల్ల చేయసాగాడు.

కొంతకాలం గడిచింది. షావుకారుకు పట్టిన ఈ పీడను ఏ విధంగా విరగడ చేయాలా అని షావుకారు మిత్రులు చాలా మంది ఆలోచించారు. చివరకు వారికి ఒక ఉపాయం తోచింది. దాన్ని వాళ్ళు షావుకారుకు చెప్పారు.

వాళ్ళు వేసిన పథకం ప్రకారం మర్నాడు ఒక మనిషి షావుకారు ఉండే వీధి వెంబడి, "ముక్కులూ, చెవులూ కొంటాం!" అని కేక వేస్తూ వచ్చాడు.

షావుకారు ఆ మనిషిని పిలిచి, "ఏమిటి నువు కొనేది?" అని అడిగాడు.

"బాబూ, మనుషుల ముక్కులూ, చెవులూ కొంటాను," అన్నాడు ఆ మనిషి.

"ఎంత ధర చేసి కొంటున్నావు?" అని షావుకారు ఆ మనిషిని అడిగాడు.

"గొప్ప వంశం వాళ్ళవైతే ముక్కూ, రెండు చెవులూ కలిపి అయిదువందలిస్తాను," అన్నాడు ఆ మనిషి.

షావుకారు ఆ మనిషికి దీవాన్ సాహెబ్‌ను చూపించి, "వీరిది గొప్ప ఠాకుర్ వంశం. ఈయన తల ప్రస్తుతం నాదే! కనక అయిదు వందలూ ఇచ్చి, ఈయన ముక్కూ, చెవులూ కోసుకుపో!" అన్నాడు.

దీవాన్ సాహెబ్‌కు హడలు పుట్టింది.

"అయ్యో, షావుకారు గారూ! ఇది చాలా అన్యాయం!" అన్నాడు ఆయన.

"ఎందుకని అన్యాయం? ఈ తల నాది, నా సొత్తు. దీనిని నేను ఎంతో డబ్బు తగలేసి పోషిస్తూ వస్తున్నాను," అన్నాడు షావుకారు.

"మనం న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళి, ఆయన సలహా తీసుకోవటం భావ్యంగా ఉంటుంది," అన్నాడు దీవాన్ సాహెబ్.

ఇద్దరూ మరొకసారి న్యాయాధికారి వద్దకు వెళ్ళి, విషయమంతా చెప్పారు. న్యాయాధికారి దీవాన్ సాహెబ్‌తో ఇలా అన్నాడు:

"షావుకారుకు మీ ముక్కూ, చెవులూ అమ్మే అధికారం తప్పకుండా ఉన్నది. లేదని మీరు వాదించే పక్షంలో, ఇంత కాలమూ ఆయన మీ తలను పోషించినది మీ తరఫుననే అన్నమాట. అలా అయిన పక్షంలో ఇన్నాళ్ళూ మీ కోసం షావుకారు చేసిన ఖర్చు యావత్తూ మీరు షావుకారుకు ఇచ్చుకోవలిసి ఉంటుంది!"

ఈ తీర్పు విని దీవాన్ సాహెబ్ మారు మాటాడకుండా తనకున్న కొద్దిపాటి ఆస్తినీ షావుకారు పేర పెట్టి, ఆ గ్రామం విడిచి వెళ్ళిపోయాడు.



# ద్వంద్వ సాక్ష్యం

ఒక గ్రామపెద్దగారి గుర్రాన్ని కొత్వాలు దొంగిలించి, చాలా పొడుగుగా ఉండే దాని తోక కత్తిరించి పొట్టి చేసి తన దొడ్లో కట్టేసుకున్నాడు. గుర్రం ఎక్కడిదని ఎరిగిన వాళ్ళు అడిగితే దూర గ్రామం నుంచి కొని తెచ్చానన్నాడు.

గ్రామపెద్ద కొత్వాలు ఇంటికి వెళ్ళి, తన గుర్రాన్ని చూసి గుర్తించి, న్యాయాధికారి వద్ద కొత్వాలు మీద ఫిర్యాదు చేశాడు. "మీ గుర్రాన్ని గుర్తించగలవారెవరన్నా ఉన్నారా?" అని న్యాయాధికారి అడిగితే, గ్రామపెద్ద తన గుర్రాన్ని ఊరి దుకాణదారు బాగా ఎరుగునన్నాడు.

న్యాయాధికారి దుకాణదారును పిలిపించి, "నీకు గ్రామపెద్దగారి గుర్రం బాగా తెలుసునా?" అన్నాడు.

వెంటనే కొత్వాలు, "గ్రామపెద్దగారి గుర్రం తోక చాలా పొడుగని దుకాణదారుకు మాత్రం తెలియదా?" అన్నాడు.

దుకాణదారు చిక్కులో పడ్డాడు. అతను గుర్రం చుట్టూ ఒకసారి తిరిగి వచ్చి, "అయ్యా, ఈ గుర్రాన్ని ముందునుంచి చూస్తే గ్రామపెద్ద గారిదిలాగుంది. వెనక నుంచి చూస్తే మరి కొత్వాలుగారిది లాగుంది," అన్నాడు.

అందరూ గొల్లున నవ్వారు. న్యాయాధికారి ఆ గుర్రం గ్రామపెద్దదేనని తీర్పు చెప్పాడు.





# ఆడదాని సలహా

పర్షియాను ఒకప్పుడు పాలించిన ఖుస్రోకు చేపలంటే చాలా ఇష్టం. ఒకనాటి ఉదయం, ఆయన తన భార్య అయిన షిరీన్‌తో సహా మిద్దెమీద కూర్చుని ఉండగా, బెస్తవాడొకడు ఒక చేపను తెచ్చి, ఆయనకు కానుకగా ఇచ్చాడు.

ఆ చేప అపురూపమైనది. చాలా పెద్దది కూడా. రాజు దానిని చూసి ఎంతో సంతోషించి, బెస్తవాడికి బహుమానంగా నాలుగు వేల కాసులు ఇవ్వమని ఉత్తరువు చేశాడు.

తన భర్త, సంతోషం కలిగినప్పుడల్లా, ఈ విధంగా ఒళ్ళు తెలియని బహుమానాలు అడ్డమైన వాళ్ళకూ ఇస్తూరావటం షిరీన్ చాలాసార్లు చూసింది. ఆమెకు ఇది ఎంత మాత్రమూ ఇష్టం లేదు.

బెస్తవాడు బహుమానం పుచ్చుకుని కిందికి దిగి పోగానే షిరీన్ తన భర్తను కోప్పడింది.

"ఒక్క చేపకు నాలుగువేల కాసులు బహుమానమా? ఇలా బహుమానాలు ఇవ్వటం మొదలు పెడితే రేపటి నుంచీ ప్రతిదానికి ఇదే ప్రకారం ఇవ్వవలిసి వస్తుంది. అందుచేత, ఏదో మిషపెట్టి బెస్తవాడికి ఇప్పించిన డబ్బు తిరిగి తీసేసు కోండి," అన్నదామె.

"ఇచ్చిన డబ్బు తిరిగి తీసుకోవటం కంటె రాజరికానికి తలవంపు మరొకటి ఉంటుందా? పేద బెస్తవాడు గదా. ఏదో, ఈ సారికి ఇలా పోనిద్దూ!" అన్నాడు ఖుస్రో తన భార్యతో.

"అలా ఎంత మాత్రమూ వీలులేదు. మన మర్యాదకు భంగం ఏమీ కలగకుండానే ఇచ్చినది తిరిగి పుచ్చుకోవచ్చు. అందుకు నేను ఒక ఉపాయం చెబుతాను వినండి. బెస్తవాణ్ణి వెనక్కు పిలిపించి, ఈ చేప మగదా, ఆడదా?' అని అడగండి.

అరేబియా జానపద కథ



అది మగదని వాడు అన్నట్టాయెనా, మగ చేప అక్కర్లేదు, ఆడ చేప కావాలని, ఈ చేపను వాడికి తిరిగి ఇవ్వండి. ఇది ఆడ దేనని వాడంటే, మగచేప కావాలి అనండి," అని షిరీన్ తన భర్తకు వివరించి చెప్పింది.

ఖుస్రోకు తన రాణిపై చాలా మక్కువ. ఆమెకు అసంతృప్తి కలిగించటం ఆయనకు ఏ మాత్రమూ ఇష్టం లేదు. అందుచేత ఆయన, తన మనస్సులో ఇదంతా చాలా అసహ్యం అనిపించినప్పటికీ, భటులను పంపి, బెస్తవాణ్ణి వెనక్కు పిలిపించాడు.

బెస్తవాడు మళ్ళీ వచ్చాడు.

"ఏమోయ్, నువు నాకు ఇప్పుడిచ్చిన చేప చూడటానికి బాగానే వున్నది. ఇంతకూ అది మగదా, ఆడదా?" అని ఆయన వాణ్ణి అడిగాడు.

బెస్తవాడు రాజుకు వంగి సలాము చేసి, "హుజూర్, ఈ జాతి చేపలలో ఆడా, మగా తారతమ్యం లేదు. ప్రతి చేపా దేనికి అదే గుడ్లు పెట్టి, పిల్లలను పొదుగుతుంది." అన్నాడు.

ఖుస్రో ఈ మాటలకు విరగబడి నవ్వుతూ, బెస్తవాడికి మరి నాలుగువేల కాసులు ఇవ్వమని ఉత్తరువిచ్చాడు.

బెస్తవాడు ఎనిమిదివేల కాసులూ తన బుట్టలో పోసుకుని, ఆ బుట్ట తీసుకుని, పరమానందంతో వెళ్ళి పోవటానికి బయలు దేరాడు.

వాడు రాజభవనం ముందున్న అవరణలో నుంచి పోతూఉండగా, బుట్టలో నుంచి ఒక కాసు కిందపడి, గచ్చు మీద దొర్లుకుంటూ ఎటోపోయింది.

వెంటనే బెస్తవాడు బుట్టను కింద పెట్టి చుట్టు పక్కల అంతటా బాగా వెతికి, తన కాసు ఏరుకుని, దాన్ని తృప్తిగా బుట్టలో వేసుకున్నాడు.

బెస్తవాడు చేసిన ఈ పని అంతా మిద్దె మీది నుంచి ఖుస్రో, అతని భార్యా చూస్తూనే ఉన్నారు.

షిరీన్ తన భర్త కేసి తిరిగి, "చూశారా, ఆ బెస్తవాడు ఎంత నీచుడో? ఎనిమిదివేల

కాసులు బుట్టలో ఉండగా, ఒక్క కాసు పడిపోతే, అది ఎవరి కన్నా పేదవాడికి దొరుకుతుంది లెమ్మన్న ఔదార్యం కూడా లేకుండా, వాడు దాని కోసం వేటాడి మరీ తీసుకున్నాడు!" అన్నది.

తన రాణిని తృప్తి పరచటం కోసం ఖుస్రో బెస్తవాణ్ణి మరొకసారి వెనక్కు పిలి పించి, వాడితో యిలా అన్నాడు:

"ఓరీ, పరమనీచుడా! ఒక్క వెండి కాసు పడిపోతే, అది ఏ పేదవాడికైనా దొరుకుతుంది లెమ్మన్న ఆలోచన అయినా చెయ్యకుండా, బుట్టెడు కాసులు అవతల పెట్టి, దాని కోసం అంతసేపు ఆ చుట్టు పక్కల అంతా కష్టపడి వెతికావే! నీ అత్యా శకు ఏమనాలి?"

బెస్తవాడు నేలదాకా వంగి సలాము చేసి, "అల్లా ఏలిన వారిని కటాక్షించాలి! ఒక్క కాసు పోయినందువల్ల నాకు దారిద్ర్యం వస్తుందని నేను ఎంత మాత్రమూ అనుకోలేదు. నా దృష్టిలో ఆ కాసు పవిత్ర మైనది. దాని మీద ఒక వైపున రాజుగారి ముద్రా, రెండో వైపున ఆయన పవిత్ర నామమూ ఉన్నాయి. అది నేల మీద పడి ఉంటే ఎవరైనా చూడక తొక్కుతారేమో నని భయపడ్డాను. తమరు మట్టిలో నుంచి కాసు విలువ చెయ్యని బెస్తవాణ్ణి ఏరగా లేందీ, నేను మట్టిలో నుంచి ఒక కాసు ఏరటంలో వింత ఏమున్నది?" అన్నాడు వినయంగా.

వాడి తెలివితేటలకు ఖుస్రో పరమా నంద భరితుడై, వాడికి మరి నాలుగువేల కాసులు అదనంగా బహుమానం ఇప్పించి పంపేశాడు.

ఈ విచిత్ర సంఘటనతో ఖుస్రోకు ఆడ వాళ్ళ సలహాలను పాటించటంలో వున్న ప్రమాదం అర్థమయింది. అందుకని ఆ రోజే ఆయన నగరమంతటా ఈ విధంగా చాటింపు వేయించాడు:

"ఆడవాళ్ళ సలహా ప్రకారం ఎవరూ నడుచుకోవద్దు. వారి సలహా విన్నట్టయితే సగం పొరపాటును దిద్దుకోవటానికి రెండు పొరపాట్లు అదనంగా చేయవలిసి వస్తుంది."



# దీర్ఘాయువుకు దివ్యౌషధం

చందననగరం రాజు దీర్ఘాయువు. కుందననగరం రాజుకు అకాలవార్ధక్యం వచ్చిపడుతున్న లక్షణాలు కనిపించాయి. అందుచేత ఆయన చందననగర రాజు దగ్గిరికి తన మంత్రిని పంపుతూ, దీర్ఘాయువు రహస్యం ఏమిటో తెలుసుకుని, దానికేమైనా మందుంటే కనుక్కు రమ్మన్నాడు; ఆ రహస్యం తెలుసుకోకుండా తిరిగి వస్తే మంత్రిని ఉరి తీయిస్తానని ఖచ్చితంగా చెప్పాడు.

చందననగరం రాజు కుందననగరం మంత్రిని ఒక పెద్ద మఱ్ఱిచెట్టు కింద గుడారంలో ఉంచి, ఆయనకు కావలసిన వసుపాయాలన్నీ చేశాడు. మంత్రి ఆ గుడారంలో ఉంటున్నాడు. రోజులు గడుస్తున్నాయి. కాని చందననగరం రాజు దీర్ఘాయువు రహస్యం గాని, ఔషధంగాని చెప్పటంలేదు.

రోజులు వారాలయాయి. వారాలు నెలలు అయాయి. కుందన మంత్రి తీవ్రమైన మనోవేదనతో కుమిలిపోతున్నాడు. ఈ రాజు రహస్యం చెప్పేటట్టు లేదు. ఆ రాజు రహస్యం తెలుసుకోకుండా వెళితే ఉరితీస్తాడు. ఒకచోట కాలు నిలవక మంత్రి మఱ్ఱిచెట్టు కింద పచార్లు చేసేవాడు.

ఒకనాడు అకస్మాత్తుగా ఆ మఱ్ఱిచెట్టు కాస్తా తగలబడిపోయింది. చందనరాజు కుందన మంత్రిని పిలిచి, "చూశావా? నీ ఉసురు తగిలి మఱ్ఱిచెట్టు నిలువునా తగలబడిపోయింది. ప్రజల ఉసురు తగిలిన రాజు కూడా ఇలాగే అవుతాడు. ప్రజల ఉసురు తగలకుండా, వారు సుఖంగా ఉండేటట్టు చూసుకోవటమే రాజు దీర్ఘాయువు కావటానికి రహస్యం. ఈ సంగతి మీ రాజుతో చెప్పు," అన్నాడు.

—తమ్మన శ్రీరాములు





# వదలని చెప్పులు

ఒకప్పుడు కైరోనగరంలో అబూ కాసిం అని ఒక మందులు అమ్మేవాడు ఉండేవాడు. వాడు చెప్పశక్యంగాని లోభి. తన వ్యాపారంలో బోలెడంత లాభం వస్తున్నప్పటికీ, డబ్బు ఖర్చు చెయ్యటం ఇష్టం లేక, బిచ్చగాళ్ళు కూడా వేసుకోని చింకిబట్టలు వేసుకునేవాడు. వాడి తలపాగా ఏనాటిదో గాని, పూర్తిగా వెలిసిపోయి, మొదట ఏ రంగులో ఉండేదో తెలియరాకుండా పోయింది. అయితే వీటి అన్నిటి కన్న ప్రసిద్ధి కెక్కినవి వాడి చెప్పులు. అవి బహు పురాతనమైనవి. ఎంతమంది చెప్పులు కుట్టేవాళ్ళు వాటిలో ఎన్నివందల మేకులు కొట్టారో, వాటికి ఎన్ని తోలుముక్కలు అతుకు పెట్టారో తెలీదు. ఏళ్ళతరబడి మరమ్మతు పొంది ఆ చెప్పులు అమితంగా బరువెక్కాయి.

అబూ కాసిం చెప్పులను జనం ప్రఖ్యాతంగా చెప్పుకునేవారు. బరువులు మోసే వాళ్ళు, "అబ్బో, ఈ మూట అబూ కాసిం చెప్పులంత బరువుందే!" అనే వాళ్ళు ఆయాసపడుతూ. ఎవరి కన్నా కడుపులో శూల వస్తే, "నేను తిన్న తిండి అబూ కాసిం చెప్పుల్లాగా పని చేస్తోంది," అనేవాళ్ళు.

ఒకసారి అబూ కాసింకు వ్యాపారంలో మంచి లాటు దొరికింది. ఇతర వ్యాపారస్థులైతే అలాటప్పుడు సాటి వర్తకులను పిలిచి విందు చేసేవాళ్ళు. కాని అబూ కాసింకు అలాటి అలవాట్లు లేవు. మంచి లాభం వచ్చినందుకు పండగ చేసుకున్నట్టుగా వాడు స్నానశాలకు వెళ్ళి వద్దామనుకున్నాడు. ఎందుచేతనంటే, వాడు స్నానశాల ముఖం చూసి ఎన్నో ఏళ్ళయింది.

వాడు తన దుకాణం మూసేసి, తొడుక్కుంటే అరిగి పోతాయని తన చెప్పులను భుజాన వేసుకుని, స్నానశాలకు వెళ్ళాడు. బయట అందరూ చెప్పులు విడిచేచోట తన

చెప్పులు కూడా ఉంచి, వాడు స్నానశాల ప్రవేశించాడు.

అబూ కాసిం వంటి నిండా ఏళ్ళతరబడి మట్టి పేరుకుని ఉండటం చేత, స్నానాలు చేయించే వాళ్ళు అతనికి చాలా పర్యాయాలు నలుగు పట్టించవలసి వచ్చింది. అతని స్నానం పూర్తి అయి బయటికి వచ్చేసరికి సూర్యాస్తమానం అయింది. స్నానాలు చేసే వారంతా ఆ సరికి వెళ్ళిపోయారు కూడా.

స్నానశాల వెలపల కాసింకు తన చెప్పులకు బదులు, పచ్చని తోలుతో తయారు చేసిన సరికొత్త చెప్పుల జత కనిపించింది.

"ఇలాటి చెప్పులు కొందామని ఎన్ని ఏళ్ళుగానో అనుకుంటున్నాను. ఆ సంగతి తెలిసి అల్లా వీటిని నాకు బహుమానంగా పంపినట్టున్నది! లేకపోతే, ఎవరైనా పొరపాటున వీటికి బదులు నా చెప్పులు తొడుక్కుపోయారో!" అనుకుంటూ వాడు ఆ చెప్పుల జతను కాళ్ళకు తొడుక్కుని పరమానందంతో అక్కడి నుండి ఇంటికి బయలుదేరాడు.

ఇంతకూ ఈ కొత్త చెప్పులు కాజీగారివి. ఆ సమయాన ఆయన ఇంకా స్నానశాలలోనే ఉన్నాడు. అయితే అబూ కాసింకు తన చెప్పులు ఎందుకు కనబడలేదంటే, చెప్పులకు కాపలా ఉండేవాడు మిగిలిన చెప్పుల మధ్య కాసిం చెప్పులు చూసి మండిపడి, వాటిని ఒక మూలగా దాచి పెట్టాడు. అబూ కాసిం స్నానశాల నుంచి బయటికి రావటం చాలా ఆలస్యం అయింది. ఈ లోపల



కాపలావాడు ఇంటికి పోయేవేళ కావటం చేత వాడు వెళ్ళిపోయాడు.

కాజీగారు స్నానం పూర్తి చేసి వెళ్ళి పోబోతూ తన చెప్పుల కోసం అడిగాడు. స్నానశాల నౌకర్లు అంతటా వెతకగా వారికి కాసిం చెప్పులు దొరికాయి. అవి లోక ప్రసిద్ధమైన చెప్పులు కావటం చేత వారు వాటిని తేలికగా పోల్చుకున్నారు.

అబూ కాసిం తన చెప్పులు వదిలేసి కాజీగారి చెప్పులు పట్టుకు పోయినట్టు స్పష్ట మయింది. స్నానశాల వాళ్ళు వెళ్ళి అబూ కాసింను కాజీగారి చెప్పులతో సహా పట్టుకు వచ్చి కాజీగారి ఎదట పెట్టారు.

కాజీ తన చెప్పులను తాను తీసుకోవటమే గాక అబూ కాసింను ఖైదులో పెట్టించాడు. జైలు అధికారులకు భారీగా లంచం పోసి అబూ కాసిం జైలు నుంచి బయటపడ్డాడు.

ఇంత జరిగాక అబూ కాసింకు తన చెప్పుల పైన చాలా ఆగ్రహం వచ్చింది. వాడు వాటిని తీసుకుపోయి నైల్‌నదిలో పారేసి పీడ వదిలించుకున్నాడు. అయితే, అవి అంత సులువుగా వదిలే చెప్పులు కావు.

కొద్దికాలం అనంతరం కొందరు పల్లె వాళ్ళు నైల్‌నది మీదికి చేపలు పట్టబోయి వల వేశారు. వలను లాగేటప్పుడు వారికి అది చాలా భారమనిపించింది. తీరా వల పైకి తీసి చూస్తే అందులో అబూ కాసిం చెప్పులు ఉన్నాయి! ఆ చెప్పుల తాలూకు మేకుల మూలాన వల తాళ్ళు చాలా చోట్ల తెగిపోయాయి.





పల్లెవాళ్ళు కూడా కాసిం చెప్పులను సులువుగానే గుర్తించారు. వాళ్ళు వాటిని కాసిం దుకాణానికి తెచ్చి, నానా తిట్లూ తిట్టుతూ, వాటిని దుకాణంలోకి గిరవాటు వేశారు. ఆ చెప్పుల తాకిడికి అబూ కాసిం మందుల సీసాలూ, అత్తరు సీసాలూ కొన్ని కిందపడి పగిలి, చాలా నష్టం జరిగింది.

అబూ కాసిం దుఃఖం వర్ణనాతీతం. వాడు తన చెప్పులను కసి తీరా తిట్టుకుని, వాటిని తన దొడ్డిలోకి తీసుకుపోయి, పాతిపెట్టటానికి గాను అక్కడ గొయ్యి తవ్వసాగాడు.

అబూ కాసిం పైన చాలాకాలంగా కసి ఉన్న పొరుగువాడు ఒకడు ఈ సంగతి కనిపెట్టి, నగరాధికారి వద్దకు వెళ్ళి, "అబూ కాసిం అధికారులకు తెలపకుండా తన దొడ్లో ఏదో నిధి తవ్వి తీసుకున్నాడు," అని ఫిర్యాదు చేశాడు.

అబూ కాసిం పరమలోభి అన్నది అందరికీ తెలిసిన విషయమే గనక, నగరాధికారి ఈ ఫిర్యాదు నమ్మి వాణ్ణి పిలిపించాడు.

"నేను నా చెప్పులను పాతెయ్యడానికి నా దొడ్లో గొయ్యి తవ్వుకున్నాను. నిధీ లేదు, ఏమీ లేదు!" అని అబూ కాసిం ప్రమాణం చేసి చెప్పాడు. పెద్ద లంచం తీసుకుని అధికారి వాణ్ణి వెళ్ళిపోనిచ్చాడు.

అబూ కాసిం దుఃఖంతో తన గడ్డం పీక్కున్నాడు. ఈసారి వాడు ఆ చెప్పులను తీసుకుని, నగరం దాటి దూరంగా వెళ్ళి వాటిని ఒక కాలవలో పారేసి, ఇక అవి తన కంట పడవన్న ధైర్యంతో ఇంటికి తిరిగి వచ్చాడు.

కాని అది భ్రమే అయింది. ఆ కాలవ మీద మర ఒకటి ఉన్నది. కాసిం చెప్పులు కాలవ ప్రవాహంలో కొట్టుకుపోయి, ఆ మర తాలూకు యంత్రాల మధ్య చిక్కుకున్నాయి. మర కాస్తా ఆగిపోయింది.

యంత్రాలు ఊడదీసి మరను మరమ్మతు చేసేటప్పుడు కాసిం చెప్పులు బయట పడ్డాయి. మర యజమాని వాటిని గుర్తించి, నష్టపరిహారం కోసం అబూ కాసిం మీద వ్యాజ్యం తెచ్చాడు. అబూ కాసిం భారీగా జరిమానా ఇచ్చుకోవలసి వచ్చింది.

కాసింకు మతిపోయినట్టయింది. ఆ పాపిష్టి చెప్పులను ఎలా వదిలించుకోవాలా అనుకుంటూ వాడు తన ఇంటి మిద్దె మీదికి వెళ్ళి, చెప్పులను పిట్టగోడపై ఉంచి, తానా గోడను అని నిలబడి ఆలోచనలో పడ్డాడు.

ఇంతలో పక్క ఇంటి మిద్దె మీద ఉన్న ఒక కుక్క కాసిం చెప్పులు చూసి, రెండు డాబాల మధ్య ఉన్న పిట్టగోడ దూకి వచ్చి, ఆ చెప్పులను ఏదో చేయబోయింది. మరుక్షణం చెప్పులు పిట్టగోడ మీది నుంచి వీధిలోకి పడిపోయాయి.

దురదృష్టవశాన ఆ సమయానికి అటుగా ఒక ముసలిది పోతున్నది. ఎంతో బరువైన ఆ చెప్పులు నెత్తి మీద పడేసరికి అది కాస్తా అక్కడే ప్రాణం విడిచింది.

ఆ సమయంలో వీధి వెంట నడుస్తున్న జనం అనేక మంది, చచ్చిపోయిన ముసలిదాని చుట్టూ గుమిగూడి అబూ కాసింను అడ్డమైన తిట్లూ తిట్టసాగారు. అంతలోనే అక్కడికి కొందరు రాజభటులు వచ్చి అబూ కాసింను పట్టుకుపోయి, ఖైదులో పెట్టారు.

చచ్చిపోయిన ముసలిదాని బంధువులకు పరిహారం ఇచ్చుకుని, జైలు అధికారులకు అంతు లేని డబ్బు లంచం పెట్టి, అబూ కాసిం ఖైదునుంచి బయటపడ్డాడు.

ఇంత జరిగాక కాసింకు జ్ఞానోదయమయింది. మర్నాడు వాడు తన చెప్పులను తీసుకుని కాజీగారి వద్దకు వెళ్ళి, వాటిని ఆయన ముందు పెట్టి, "మహాప్రభూ! ఈ దిక్కుమాలిన చెప్పులు నా కొంప గుల్ల చేశాయి. వీటి మూలాన నేను బికారిని అయిపోయాను. నేనిప్పుడు తమకు విన్నవించుకునేది ఏమంటే, ఇవాళ నుంచీ నాకు చెప్పులనేవి లేవు. ఏ చెప్పులవల్లగాని, ఎవరికిగాని, ఎలాటి నష్టమైనా జరిగే పక్షాన నేను దానికి జవాబు దారును కాను. ఈ సంగతి తమరు చట్ట రీత్యా గుర్తించగలందులకు తమ ఘనతను ఎంతగానో ప్రార్థిస్తున్నాను!" అని ఎలుగెత్తి చెప్పాడు.

ఆ మాటలు విని, న్యాయస్థానంలో ఉన్న మిగిలిన అందరితోబాటు కాజీగారు కూడా విరగబడి నవ్వాడు.



# జరగని మోసం

ఒక ధనికుడి తోటలో రాములు అనే తోటమాలి పనిచేస్తూ ఉండేవాడు. ధనికుడు దుర్బుద్ధి కలవాడు. ఆయన కొడుకు తండ్రి అడుగుజాడలలో నడుస్తూ చిన్న చిన్న దొంగతనాలు చేసేవాడు. వయను మళ్ళిన రాములు అలాటి వాళ్ళ కింద పనిచేసేవాడు.

అంతలో ఒకనాడు తోటలో పనిచేసుకుంటున్న రాములు వద్దకు ఒక మనిషి వచ్చి, "మీ మేనత్త చనిపోతూ నీ పేర నూరు రూపాయలు ఇచ్చింది. ఇదుగో సొమ్ము. జాగ్రత్త పెట్టుకో," అని చెప్పి వెళ్ళిపోయాడు.

రాములు మర్నాడు తన యజమానికి చెప్పి, తన గ్రామం వెళ్ళి, ఆ సొమ్ముతో బతుకుదామనుకుని, దాన్ని తన పాకలో దాచడం క్షేమం కాదని, తోటలోనే ఒక చింతచెట్టు తొర్రలో దాచాడు.

ఇది యజమాని కొడుకు కంట పడింది. రాములు పని పూర్తిచేసి తన గుడిసెకు పోగానే వాడు చింతచెట్టు తొర్రలోనుంచి డబ్బు తీసి, తన తండ్రి వద్దకు వెళ్ళి, "నాన్నా మన తోటలో డబ్బు దొరికింది," అని ఇచ్చేశాడు.

మర్నాడు రాములు యజమాని వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు. తరవాత యజమాని కొడుకు తండ్రి వద్దకు వచ్చి, "నాన్నా, అలా వున్నావేం?" అని అడిగాడు.

"నిన్న నీకు దొరికిన డబ్బు కనబడలేదురా!" అన్నాడు తండ్రి.

"దాన్ని ఎక్కడ పెట్టావేం?" అని కొడుకు అడిగాడు.

"తోటలో చింతచెట్టు తొర్రలో," అన్నాడు తండ్రి. —ఎం. మైథిలి





# ఋణానుబంధం

పూర్వకాలమందు ధారానగరంలో ధర్ముడు అనే మాదిగవాడు ఉండేవాడు. తక్కిన మాదిగలందరిలాగా ధర్ముడు కూడా చెప్పులు కుట్టుకుని జీవిస్తూ ఉండేవాడు. చెప్పులు కుట్టి అమ్ముకోవడమే కాకుండా ధర్ముడికి రాత్రి వేళ నగరంలో గస్తీ తిరిగే తలారి పని కూడా ఉండేది. ధర్ముడు రాత్రి అంతా మేలుకుని, నగరమంతా తిరుగుతూ, ఘుము ఘుముకీ, "దొంగలు వస్తారు, జాగ్రత్తగా ఉండండి!" అని ప్రజలను హెచ్చరించేవాడు.

ధర్ముడికి కాలక్షేపం బాగానే జరుగుతున్నది. కాని ఎన్నాళ్ళకూ సంతానం కలగలేదనే విచారం మాత్రం ఎక్కువగా బాధిస్తున్నది.

ఆ వూళ్ళోనే గొప్ప పండితుడు ఒకాయన ఉండేవాడు. ధర్ముడు గస్తీ తిరిగే పని ముగించుకుని ఇంటికి పోయే సమయంలోనే ఆ పండితుడు ఏటికి స్నానానికి బయలుదేరి వచ్చేవాడు. ఇలానే ఒకనాడు ఆ పండితుడు ఏటికి స్నానానికి వచ్చే సమయానికి ధర్ముడు ఆయనకు ఎదురుపడి దణ్ణం పెట్టి, తనకు త్వరలో సంతానం కలిగేటట్టు దీవించమని ప్రార్థించాడు.

దానికి పండితుడు, "ధర్మన్నా, పిల్లలు లేరని ఎందుకోయి విచారపడతావు?

'ఋణానుబంధ రూపేణా
పశు పత్ని సుతాలయాః'

అన్నారు. అనగా, పెళ్ళామూ, పిల్లలూ, గొడ్డూ, గోదా, ఇల్లూ, వాకిలీ మొదలైనవన్నీ కేవలమూ ఋణానుబంధం వల్లనే వస్తాయి. ఋణం తీరిపోగానే పోతాయి," అని చెప్పి, స్నానానికి వెళ్ళిపోయాడు.

పండితుడు చేసిన ఈ బోధ వల్ల ధర్ముడికి వైరాగ్యం కలగకపోగా, సంతానం పొందటానికి ఒక ఉపాయం తట్టింది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

"నా సొమ్ము ఎవడైనా అనుభవించి, దానికి ప్రతిఫలం ఇవ్వకపోతే, వాడు నాకు ఋణ పడతాడు. అప్పుడు వాడు నా కడుపున పుట్టి ఋణం తీర్చుకొనక తప్పదుగద! ఈ విధంగా నాకు సంతానం కలిగే అవకాశం ఉన్నది." అని ధర్ముడు ఆలోచించాడు.

ఈ ఆలోచనతో ధర్మన్న తాను తయారు చేసే చెప్పుల జతలను తన వద్దకు వాటి కోసం వచ్చే వాళ్ళకు డబ్బు పుచ్చుకో కుండా ఉచితంగా ఇచ్చెయ్యటానికి ప్రయత్నించాడు.

కాని ఆ వచ్చినవాళ్ళు, "ఉత్త పుణ్యా నికి నీ చెప్పులు పుచ్చుకొని, నీ ఋణాన పడి ఉండటానికి మాకేమంత గ్రహచారం!" అనేసి, మరొక చోటికి పోయి కొనుక్కొ సాగారు. ధర్మన్నకు ఋణపడటానికి ఏ ఒక్కరూ ఒప్పుకున్నారుకారు.

ఇది పనికాదనుకొని ధర్మన్న మరొక ఉపాయం పన్నాడు.

"ఊరికీ ఏరుకీ మధ్య ఇసుక పర్ర ఇంచుమించు కోసున్నర దూరం ఉన్నది కదా! ఒక మంచి చెప్పుల జతను మధ్య దారిలో పెట్టి వస్తాను. మిట్ట మధ్యాహ్నము వేళ ఒక్కడైనా జోడు లేకుండా ఆ దారిన రాకపోతాడా? ఆ చెప్పుల జత తొడుక్కొక పోతాడా? ఇక ఆ తొడుక్కున్న వాడు నాకు ఋణపడకుండా ఎలా పోతాడు?" అని ధర్మన్న ఆలోచనచేశాడు.

ఈ ఆలోచనతో ధర్మన్న ఉదయానే కొత్త చెప్పుల జత ఒకటి తీసుకుని పోయి,



ఇసుక పర్రలో నడి దారిలో పెట్టాడు. సాయంకాలం వెళ్ళి చూస్తే, ఎక్కడ పెట్టిన చెప్పుల జత అక్కడే ఉన్నది.

ఎన్నాళ్ళు చూసినా ఆ చెప్పులను ఎవరూ తొడుక్కొని పోయేటట్టు కనపడలేదు. "అయ్యో, నాకిక సంతాన ప్రాప్తి లేదు కాబోలు! లేకపోతే, ఆ చెప్పుల కోసం ఎవరూ ఆశించకపోవటమేమిటి? నాకు ఋణ పడకపోవటమేమిటి?" అనుకుని ధర్మన్న నిరాశ చెందాడు.

అయినా ధర్మన్న తన పట్టు వదలక, ఆ చెప్పుల జతను అక్కడే నడి దారిలో ఉంచి, రోజూ సాయంత్రం వెళ్ళి, వాటిని ఎవరైనా తొడుక్కుపోయారా లేదా అని చూసి రాసాగాడు.

కొంత కాలం గడిచాక ఒకనాటి సాయంత్రం ధర్మన్న వెళ్ళి చూసేసరికి ఆ చెప్పుల జత అక్కడలేదు.

"నా ప్రయత్నం ఇన్నాళ్ళకు ఫలించింది! నా అదృష్టం పండింది." అనుకుని ధర్మన్న ఇంటికి వెళ్ళి, ఈ సంతోష వార్త తన భార్యకు తెలిపాడు. ఆమె కూడా ఈ సంగతి విని పొంగిపోయింది.

ఇంతకూ ఆ చెప్పుల జతను తీసుకున్నది ఎవరో ధర్మన్నకు తెలియదు. తెలుసుకోవాలన్న ఆదుర్దా కూడా వాడికి లేక పోయింది.

## 2

ఋణానుబంధాన్ని గురించి ధర్మన్నకు బోధ చేసిన పండితుడు ఒకనాడు తొందర





పని మీద పారుగూరు వెళ్ళవలసి వచ్చింది. ఆయన పని చూసుకుని తిరిగి వచ్చేసరికి సరిగా మధ్యాహ్నం రెండు ఝాములయింది. కాళ్ళకు చెప్పులు లేనందున పండితుడి పాదాలు ఇసుకలో కాలి బొబ్బలెక్కాయి. అంతలో ధర్మన్న దారిలో ఉంచిన చెప్పుల జత ఆయన కళ్ళ పడింది. "బతుకు జీవుడా!" అని పండితుడు ఆ చెప్పులను తన కాళ్ళకు తొడుక్కున్నాడు.

"ఎవడో మాదిగ వీటిని అమ్మకానికి తెచ్చి ఇక్కడ పెట్టి, ఎటో వెళ్ళి ఉంటాడు," అనుకుని పండితుడు ఆ మాదిగ కోసం చాలాసేపు ఎండలో నిలబడి అన్ని దిక్కులూ చూశాడు. కాని ఎవరూ అటుకేసి రాలేదు.

"సరే, ఈ చెప్పులను పెట్టినది ఎవరో ఊళ్ళో కనుక్కుని డబ్బు ఇచ్చెయ్య వచ్చులే," అనుకుని పండితుడు తన ఇల్లు చేరుకున్నాడు. ఆ సాయంత్రం ఆయన ఊళ్ళోని మాదిగవాళ్ళనందరినీ వాకబు చేశాడుగాని, వాళ్ళందరూ, "మాకు తెలియదు," అంటే, "మాకు తెలియదు," అన్నారు. ధర్ముడు మాత్రం, తన రహస్యం ఎక్కడ బయట పడుతుందోనని, కొన్నాళ్ళ పాటు పండితుడి కంట పడటమే మానేశాడు.

చెప్పులను గురించి తాను ఎవడికి ఋణ పడి ఉన్నదీ ఎంత ప్రయత్నించినా తెలియక పోయినందుకు పండితుడు చాలా కించ పడ్డాడు. మరి కొద్ది రోజులకే ఆయన జబ్బు పడి, మరణించి, ధర్ముడి ఋణం తీర్చు కోవటం కోసం వాడి భార్య కడుపున పడ్డాడు.

## 3

గర్భవతి అయిన ధర్ముడి భార్య పది నెలలూ మోసి, పండులాంటి కొడుకును కన్నది. గూడెంలో అందరూ సంతోషించి, వేడుకలన్నీ జరిపారు. తల్లి దండ్రుల ఆనందానికి అంతే లేదు. వాళ్ళు తమ కొడుక్కు సంగడు అని పేరు పెట్టుకున్నారు.

సంగడు క్రమంగా పెరిగి పెద్దవాడు అయాడు. వాడు కూడా తండ్రిలాగే చెప్పులు కుట్టి, వాటిని ఊళ్ళో అమ్మి, డబ్బు తెచ్చే వాడు. అలా తెచ్చిన డబ్బును సంగడు

ఇవ్వబోతే ధర్ముడు తీసుకునేవాడు కాదు. కొడుకు వద్ద డబ్బు తీసుకుంటే వాడికీ తనకూ ఉన్న ఋణాను బంధం తెగి పోతుందనీ, వాడు తనకు దక్కడనీ ధర్ముడి భయం; ఈ సంగతి తన భార్యకు కూడా చెప్పి, కొడుకు డబ్బు తెస్తే దాన్ని తాక వద్దని గట్టిగా హెచ్చరించాడు.

పూర్వజన్మలో తాను ఫలానా పండితుడు అన్న సంగతి సంగడికి తెలుసు; తాను ధర్ముడికి కొడుకై పుట్టటానికి గల కారణం కూడా తెలుసు. "ఎంతలో ఆ చెప్పుల ఋణం తీర్చుకుంటానా, ఎంత వేగంగా ఈ జన్మ చాలించుకుంటానా?" అని సంగడు ఆత్రపడేవాడు. కాని తాను సంపాదించుకు వచ్చిన డబ్బును తల్లి దండ్రులు పుచ్చుకొనక పోవటంవల్ల అనుకున్నంత త్వరగా వాడికి వాళ్ళతో ఋణానుబంధం తీరటం లేదు.

ఇలా ఉండగా, ఒకనాడు ధర్మన్న ఊరికి పోవలసి వచ్చింది. వాడు తన కొడుకును పిలిచి, "నాయనా, నేను ఊరికి పోతున్నాను. ఈ రాత్రి నాకు బదులు నువు నగరంలో గస్తీ తిరిగి, నాలుగు ఝాములా ప్రజలను హెచ్చరించాలి," అని చెప్పాడు.

తండ్రి చెప్పిన ప్రకారం ఆ రాత్రి సంగడు నగరంలో గస్తీ తిరగటానికి బయలు దేరాడు. అతని వెంట వచ్చిన తలారి, "సంగన్నా, రాత్రి ఝాము గడిచింది.



నిద్రలో ఉన్నవారిని మేలుకొలిపి, జాగ్రత్తగా ఉండమని హెచ్చరిక చెయ్యి." అన్నాడు.

అప్పుడు సంగన్న కంఠం ఎత్తి అందరికీ మెలకువ వచ్చేటట్టు ఈ శ్లోకం చదివాడు:

"మాతా నాస్తి, పితా నాస్తి,
నాస్తి బంధు, స్సహోదరః,
అర్థం నాస్తి, గృహం నాస్తి,
తస్మాత్ జాగ్రత, జాగ్రత!"

కూడా వచ్చిన తలారికి ఆశ్చర్యం వేసి, "ఈ శ్లోకానికి అర్థం ఏమిటి?" అని సంగణ్ణి అడిగాడు. దానికి సంగన్న, "తల్లిలేదు, తండ్రి లేదు, చుట్టం లేదు, సోదరుడు లేదు, ధనం లేదు, ఇల్లు లేదు. కనుక జాగ్రత్తగా ఉండండి," అని అర్థం చెప్పాడు.

మరొక ఝాము గడిచింది. అప్పుడు సంగడు మరొక శ్లోకం ఇలా చదివాడు:

"కామ క్రోధశ్చ లోభశ్చ
దేహే తిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ,
తస్మాత్ జాగ్రత, జాగ్రత!"

సంగడు ఈ శ్లోకం చదివి ప్రజలను మేలుకొలపగానే, 'వీడు ఇంత చదువు ఎప్పుడు చదివాడా?' అని తోడివానికి ఆశ్చర్యమై ఈ శ్లోకానికి కూడా అర్థం చెప్ప మన్నాడు.

"కామం, క్రోధం, లోభం అనే దొంగలు జ్ఞానమనే రత్నాన్ని అపహరించటానికి మన దేహంలో దాగి ఉన్నారు. కనుక, జాగ్రత్త!" అని సంగడు శ్లోకానికి అర్థం చెప్పాడు.

తలారివాడికి ఆశ్చర్యం పుట్టుకు వచ్చింది. అతను సంగడితో, "సంగన్నా, నీ మాటలన్నీ విడ్డూరంగా ఉన్నాయి. ఇంత కాలమూ నీ బాబు, చెంబూ తప్పేలా ఎత్తుకుపోయే దొంగలను గురించి హెచ్చ రించాడుగాని, ఇటువంటి దొంగలను గురించి ఎన్నడూ చెప్పనే లేదు. మాకు తెలియ కుండా ఇవన్నీ నువు ఎప్పుడు నేర్చావో చిత్రంగా ఉన్నది," అంటూ తన ఆశ్చర్యాన్ని తెలిపాడు.

మూడవ ఝాము గడిచింది. నిద్రపోయే ప్రజలను మేలుకొలిపి, హెచ్చరిస్తూ సంగడు మరో శ్లోకం ఇలా చదివాడు:

"జన్మ దుఃఖం, జరా దుఃఖం,
జాయా దుఃఖం పునః పునః,



సంసారసాగరం దుఃఖం,
తస్మాత్ జాగ్రత, జాగ్రత!"

ఇది విని తలారివాడు మరింత ఆశ్చర్య పడి, "ఏమిటి, సంగన్నా, ఇన్ని రకాల దుఃఖాలు ఏకరు పెడుతున్నావు! వీటికి కూడా కాస్త అర్థం చెబుదూ!" అని కోరాడు.

దానికి సంగన్న, "జన్మ ఎత్తడమే దుఃఖం. ముసలితనం దుఃఖం. భార్య ఒక దుఃఖం. మొత్తం సంసారమే ఒక సముద్రం లాటి దుఃఖం. అందుచేత జాగ్రత్తగా ఉండండి." అని శ్లోకానికి అర్థం చెప్పాడు.

దీనికి తోడివాడు, "మీ బాబు పిల్లను తెచ్చి నీకు పెళ్ళి చేదామనుకుంటూ ఉంటే, ఇలా మెట్ట వేదాంతం మొదలు పెట్టా వేమిటి?" అన్నాడు.

మరికొంత సేపటికి నాలుగో ఝాము అయింది. అప్పుడు సంగడు ఇలా చదివాడు:

"ఆశయా బద్ధతే లోకే
కర్మణా బహు చింతయా,
ఆయుక్షీణం న జానాతి,
తస్మాత్ జాగ్రత, జాగ్రత!"

ఈ శ్లోకానికి కూడా అర్థం చెప్పమని తోడివాడు అడిగాడు. దానికి సంగడు, "ఆశ చేతనూ, కర్మ చేతనూ, అనేక చింతల చేతనూ ఈ లోకం బంధించబడి ఉన్నది. వీటి మధ్యను ఆయువు క్షీణిస్తున్న సంగతి తెలియదు. అందుచేత జాగ్రత్తగా ఉండాలి." అని శ్లోకానికి అర్థం చెప్పాడు.

ఆ పట్టణాన్ని ఏలే రాజుగారు, సంగడు మొదటి ఝాము కాగానే చదివిన మొదటి



శ్లోకం విన్నాడు. ఆయనకు ఆశ్చర్యం వేసింది. ఇంకా ఏమైనా శ్లోకాలు వినిపిస్తా యేమోనని ఆయన మేలుకొని ఉండి, మిగతా మూడు శ్లోకాలు కూడా విన్నాడు.

తెల్లవారగానే రాజుగారు, రాత్రి గస్తీ తిరిగిన తలారివాణ్ణి తీసుకురమ్మని తన భటులను ఆజ్ఞాపించాడు. సంగన్న రాగానే రాజు వాడికి నమస్కరించి, "మీరెవరో మహానుభావులుగాని సామాన్యుడు కాదు. తలారి కేమిటి, ఇంత పాండిత్యమేమిటి? నాయందు దయఉంచి, ఈ కానుక స్వీక రించండి," అంటూ వరహాలు నిండి ఉన్న ఒక సంచీని సంగడికి ఇచ్చాడు.

కాని సంగడికి ఆ ధనంతో ఏం పని? తనకు పనిలేకపోయినా ఆ సంచీని తన తల్లి దండ్రులకు ఇచ్చి ఋణవిముక్తి పొందు దామనుకుని సంగడు దాన్ని తీసుకున్నాడు.

మర్నాడు ధర్మన్న ఊరి నుంచి తిరిగి వచ్చాడు. తాను రాజు వద్ద నుంచి బహు మానంగా తెచ్చిన వరహాలు ఇద్దామంటే తండ్రి తీసుకోడని సంగడికి తెలును. అందు చేత ఏం చేద్దామా అన్న ఆలోచనలో పడ్డాడు వాడు.

ఇంతలో మాదిగవాడలో కొంపలు అంటు కున్నాయి. తలారి వాళ్ళంతా సామానులు తగలబడిపోకుండా బయటికి చేర్చుతున్నారు. సంగడు ఇంటిలో నుంచి ఒక్కొక్క సామానే తెచ్చి, బయట ఉన్న తండ్రికి అందిస్తు న్నాడు. ధర్ముడు వాటిని అందుకుని అవతల సర్దుతున్నాడు.

ఈ సందడిలో సంగడు తాను రాజుగారి వద్ద బహుమానంగా పుచ్చుకున్న వరహాల సంచిని కూడా తండ్రికి అందించాడు. అది ఏమిటో కూడా చూడకుండా ధర్ముడు దాన్ని మిగిలిన సామాన్లతోపాటు సర్దేశాడు.

సంగడు తన ఋణం తీరిపోయిందని సంతోషించాడు. వాడు కాలుతున్న ఇంట్లోకి మళ్ళీ వెళ్ళిపోయి మరి బయటికి రాలేదు.

జరిగినది ఏమిటో ధర్మన్నకు అర్థ మయింది. తనకు కొడుకుగా పుట్టిన పండి తుడు చేసిన బోధ జ్ఞాపకం చేసుకుని అతను జ్ఞానవంతుడు అయాడు.






# నేర పరిశోధన

శ్రావస్తినగరాన్ని ప్రసేనజిత్తు పరిపాలించే కాలంలో దూరదేశం నుంచి, ఒంటరిగాడైన బ్రాహ్మణు డొకడు ఆ నగరానికి వచ్చాడు. అదృష్టవశాన నగరంలోని గొప్ప వైశ్యుల ప్రాపకం ఆ బ్రాహ్మణుడికి దొరికింది. ఆయనకు అన్నవస్త్రాలు నిత్యమూ పుష్కలంగా దొరకటమేగాక, దానాలూ, దక్షిణలూ, సంభావనలూ కూడా దొరికాయి.

ఆయన ఒంటరి వాడు కావటం చేత ఇలా దొరికిన సొమ్మును కొద్ది కాలంలోనే బంగారంగా మార్చి, వెయ్యి దీనారాలు పోగుచేసి, దాన్ని మరొక విధంగా భద్ర పరచ లేక, అడవిలో ఒక చోట పాతి పెట్టేశాడు.

భార్యా, బిడ్డలూ, అన్నదమ్ములూ, బంధువులూ ఎవరూ లేని ఆ బ్రాహ్మణుడి పంచ ప్రాణాలూ ఆ బంగారం మీదే ఉండేవి. రోజూ ఆయన అడవికి పోయి, తాను పాతి పెట్టిన ధనం ఎవ్వరూ తవ్వుకు పోలేదు గదా అని చూసుకుని, తిరిగి ఇంటికి వస్తూండే వాడు.

ఇలా కొంతకాలం జరిగిన అనంతరం, ఒకనాడు ఆయన అడవికి వెళ్ళి చూసేసరికి, తాను పాతి పెట్టినచోట బంగారం లేదు. దాన్ని అంతకు ముందే ఎవరో తవ్వి తీసుకు పోయారు.

ఈ సంగతి గ్రహించగానే బ్రాహ్మణుడికి మతి పోయినట్టయింది. ఆయన గుండెలు బాదుకుంటూ, ఏడుస్తూ, నగరంలో వచ్చి పడ్డాడు. కనిపించిన వారికల్లా తనకు కలిగిన ఆపద చెప్పుకున్నాడు. ఆయనను ఊదార్చటం ఎలాగో ఎవరికీ తెలియలేదు.

"నా డబ్బే పోయాక నేను మాత్రం జీవించటం దేనికి? వెళ్ళి నదిలో దూకి, ఆత్మహత్య చేసుకుంటాను," అంటూ ఆ బ్రాహ్మణుడు నది కేసి పరిగెత్తాడు.



అప్పుడే నదిలోస్నానం చేసి తిరిగి వస్తున్న ప్రసేనజిత్తుమహారాజు, నది కేసి పరిగెత్తుతున్న బ్రాహ్మణుణ్ణి చూసి, సంగతి తెలుసుకుని, "ఎందుకయ్యా, పిచ్చి బ్రాహ్మడా, ఆత్మహత్య చేసుకుంటావు? నా రాజ్యంలో దొంగతనం జరిగితే విచారించేటందుకు నేను లేనా? నీ సొత్తు కాజేసిన వాణ్ణి నేను పట్టుకుంటాను. లేదా, నీ సొమ్ము నా బొక్కసం నుంచి ఇప్పిస్తాను. నువు ఈ డబ్బు పాతిపెట్టిన స్థలానికి గుర్తు లేమైనా ఉన్నాయా?" అని అడిగాడు.

"మహాప్రభూ, నేను నా ధనం పాతిపెట్టినచోట నాగబల (అడవిబీర) అనే పనికి మాలిన మొక్క ఒకటి ఉండేది. ఇప్పుడు అది కూడా పోయింది," అన్నాడు బ్రాహ్మణుడు.

"అడవిబీర మొక్క ఎలా గుర్తు అవుతుంది? అడవిలో అలాటి మొక్కలు ఎన్ని అయినా ఉండవచ్చు గదా?" అని రాజు అడిగాడు.

"లేదు, మహాప్రభూ! ఆ ప్రాంతంలో అదొక్కటే అలాటి మొక్క." అని బ్రాహ్మణుడు జవాబు చెప్పాడు.

"అయితే, నువు అక్కడ సొమ్ము దాచిన సంగతి ఎవరెవరికి తెలుసు?" అని రాజు మళ్ళీ అడిగాడు.

"మహాప్రభూ, ఆ రహస్యం నాకు తప్ప మరెవరికీ తెలీదు, చెప్పుకోవటానికైనా నాకు ఎవరున్నారు? నేనక్కడికి పోవటం ఎవరూ, ఎన్నడూ చూసి ఉండలేదు," అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు బ్రాహ్మణుణ్ణి పంపేసి, తన భవనానికి తిరిగి వచ్చి, జరిగిన దొంగతనం గురించి చాలా తీవ్రంగా ఆలోచించాడు. దొంగను పట్టుకునే ఉపాయం రాజుకు త్వరలోనే స్ఫురించింది.

ఆయన తన మంత్రిని పిలిపించి, "మంత్రీ, నాకు ఆరోగ్యం సరిగా లేదు. వెంటనే వైద్యులను చూడటం మంచిదనుకుంటున్నాను. నగరంలో ఉండే వైద్యులనందరినీ పిలిపించండి," అన్నాడు.

రాజుగారు రమ్మన్నారనగానే నగరంలో వైద్యవృత్తి చేసుకునే వారందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు. రాజు ఒక్కొక్క వైద్యుణ్ణి తానున్న చోటికి రప్పించి, "ఏమయ్యా, నువు నిన్నా ఇవాళా ఏయే రోగాలకు చికిత్స చేశావు? ఔషధాలకు ఏయే మూలికలు వాడావు?" అని అడిగి, వాళ్ళు చెప్పినది విని, పంపివేయసాగాడు.

దగ్గిరే ఉండి రాజు అడిగే ప్రశ్నలు వింటున్న మంత్రికి రాజు ఉద్దేశమేమిటో కొంచెం కూడా బోధపడలేదు. ఒక్కొక్క వైద్యుడే లోపలికి వస్తున్నాడు, రాజు అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పి వెళ్ళిపోతున్నాడు.

చివరకు ఒక వైద్యుడు, "మహారాజా, నిన్న మాతృదత్తు డనే వైశ్యశిఖామణికి నాగబల రసంతో ఔషధం తయారుచేసి ఇచ్చాను," అని రాజు అడిగిన ప్రశ్నలకు సమాధానంగా చెప్పాడు.

రాజు ఆసక్తితో, "అలాగా? నాగబల అనేది చాలా అరుదైన ఓషధి అని విన్నాను. అది నీకు ఎక్కడ దొరికింది?" అని వైద్యుణ్ణి అడిగాడు.

"నిజమే, మహారాజా. నా సేవకుడు అడవి అంతా ఒక రోజల్లా కష్టపడి వెతికి, దాన్ని సంపాదించి తెచ్చాడు." అన్నాడు వైద్యుడు.



"అయితే నువు వెళ్ళి, ఆ సేవకుణ్ణి వెంటనే ఒకసారి నా వద్దకు పంపించు." అన్నాడు రాజు.

కొంత సేపటికి వైద్యుడి సేవకుడు రాజు గారి-వద్దకు వచ్చి నిలబడ్డాడు.

"ఒరే, నిన్న నువు అడవిబీర మొక్కను తవ్వినప్పుడు దాని కింద దొరికిన వెయ్యి దీనారాలూ ఏం చేశావు?" అని రాజు వాణ్ణి అడిగాడు.

సేవకుడు తెల్లబోయి, "మా ఇంట దాచాను, మహారాజా!" అన్నాడు.

"అవి ఫలాని బ్రాహ్మణుడివి. వాటిని తీసుకుపోయి వెంటనే ఆయనకు ఇచ్చెయ్యి, వెళ్ళు," అన్నాడు రాజు.

"చిత్తం, మహారాజా! అలాగే యిస్తాను," అని సేవకుడు రాజుకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఇదంతా ఎంతో విచిత్రంగా గమనిస్తున్న మంత్రికి, రాజు ఏ విధంగా ఆ బంగారం ఎత్తుకు పోయిన వాణ్ణి గుర్తించాడో అర్థం కాలేదు. ఆయన రాజునే అడిగి రహస్యం తెలుసుకుందామనుకుని, "మహారాజా, మీరు ఈ దొంగతనాన్ని ఇంత సులువుగా ఎలా పట్టగలిగారో నా కర్థం కావటం లేదు," అన్నాడు.

రాజు నవ్వి ఇలా చెప్పాడు:

"దొంగతనం గురించి బ్రాహ్మణుడు చెప్పినదంతా నిజమనే నమ్మకం తోటే నేను దొంగను పట్టటానికి పూనుకున్నాను. నగరం లోని ఇన్ని లక్షల మందిలో ఒకడే ఈ దొంగ తనం చేసి ఉండాలి గద! అక్కడ తాను ధనం దాచిన మాట ఎవరికీ తెలియదని బ్రాహ్మణుడు అన్నాడు. ఆ స్థలంలో ధనం ఉన్నదని తెలియకుండానే అక్కడ తవ్వ వలసిన అవసరం ఎవరికి కలుగుతుంది? అడవిబీర మొక్కతో ఏదో అవసరం అయిన పని ఉన్నవాడికేగద!

"ఆ చుట్టు పక్కల ఎక్కడా అడవిబీర మొక్క లేదని బంగారం పోగొట్టుకున్న బ్రాహ్మణుడు స్పష్టంగా చెప్పాడు. అది నిజా నికి అరుదైన మొక్కనట. నేను బ్రాహ్మ ణుడు చెప్పిన మాట నమ్మాను. ధనం తీసుకున్నవాడు మొక్కకోసమే తవ్వాడన టానికి మరొక ఆధారమేమంటే, ధనంతో బాటు మొక్క కూడా పోయింది. కేవలమూ ధనం కోసమే తవ్వినవాడైతే మొక్కను అక్కడే వదిలి పోయేవాడు.

"ఇప్పుడు, అడవిబీర మొక్కతో ఎవరికి పని ఉంటుంది? వైద్యుడికి! అందుకనే వైద్యుల నందరినీ పిలిపించాను. అడవిబీర మొక్కను ఉపయోగించిన వైద్యుడు దొరక గానే దొంగ కూడా దొరికాడు. ఇందులో అర్థం కాని దేమిటి, మంత్రీ?"

రాజు చెప్పినది విని రాజుకు గల పరి శోధనా శక్తిని మంత్రి ఎంతో మెచ్చు కున్నాడు.



# నిజమా? అబద్ధమా?

క్రౌంచనపుర రాజకుమార్తెకు పెళ్ళి యీడు వచ్చింది. తండ్రి ఆమెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. అప్సరసలను మించిన సౌందర్యంగల ఆ రాజకుమార్తెను పెళ్ళాడటానికి ఎందరో రాజకుమారులు వచ్చారు.

"నేను నమ్మజాలని అతిశయాలు చెప్పిన వారిని పెళ్ళాడతాను," అని రాజకుమార్తె రాకుమారులతో చెప్పింది.

ఒక్కొక్క రాజకుమారుడే వచ్చి అసంభవమైన విషయాలు ఎన్నో చెప్పారు. అన్నిటికి రాజకుమార్తె, "నేను నమ్మగలను," అన్నది.

చివరకు ఒక రాజకుమారుడు ఆమెతో, "నేను ఒక వెన్నెల రాత్రి ఉద్యానంలో ఉండగా ఒక అద్భుత సౌందర్యరాశి కనిపించి, నన్నే పెళ్ళి చేసుకుంటాననీ, తన కోసం ఏర్పాటు చేసే స్వయంవరానికి రమ్మనీ చెప్పి మాయమయింది. ఈ స్వయంవరంలో నిన్ను చూడగానే నువే ఆ సౌందర్యవతివి అని గుర్తించాను," అన్నాడు.

రాజకుమార్తె ఆ మాట నమ్మితే అతనికి మాట ఇచ్చినందుకు అతన్నే పెళ్ళాడాలి. నమ్మనంటె తాను పెట్టిన పరీక్షలో నెగ్గినందుకైనా అతన్ని పెళ్ళాడక తప్పదు. అందుచేత ఆమె ఆ రాజకుమారుణ్ణి పెళ్ళాడింది.



Photo by M. Natarajan



బహుమతి
పొందిన వ్యాఖ్య

చెంబుడు నీళ్ళు

పంపినవారు :
వి. గంగయ్య

Chandamama July '72

Photo by M. Natarajan



గోపురం వీధి,
నెల్లూరు-2

చెం.చా కూర

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు జూలై నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వ్యాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



అట్టమీది బొమ్మ: బేతాళకథ

రెండవ అట్ట: మురళీకృష్ణ

అట్ట చివరి బొమ్మ: ఋణానుబంధం

మూడవ అట్ట: గోపికాకృష్ణ


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్
దంతవైద్యునిచే సృష్టించబడిన టూత్ పేస్ట్

49F-203R-TEL

